# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 15 రాజమహేంద్రవరము 16-12-1991, 1-1-1992 సంచికలు 1, 2



**ఈ సంచికలో రచయితలు.—**

1. శ్రీ ఆవంత్స సోమసుందర్
2. డా॥ ఎ. పద్మశాల
3. శ్రీ చిర్రావూరి శ్రీరామశర్మ
4. డా॥ మిరియాల రామకృష్ణ
5. శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్
6. శ్రీ నందినేని రవీంద్ర
7. డా॥ టి. బాలసుబ్రహ్మణ్య
8. డా॥ వం[illegible]రి వేంకటసత్యరామారావు

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 20_00 6 మాసములకు రు 12_00 విడి ప్రతి రు 2_00

— సకాలంలో చందా పంపి సహకరించండి —

# సంపాదకుని మాట

ఏ రంగంలో చూసినా సంక్షోభమే! ప్రభుత్వాలను తప్పుపట్టడమేకాని ప్రజానీకానికి కూడా బాధ్యత లేకుండానే ఉన్నారు. ఎంతసేపూ తప్పులు పట్టడమేకాని మనం చేస్తున్న దేమిటి అని ఆలోచించుకునే కనీసజ్ఞానం కోల్పోతున్నారు ప్రజలు. సమాజశ్రేయస్సు ఏ ఒక్కరి బాధ్యతా కాదు. అది అందరి సమిష్టిబాధ్యత. ఇప్పుడు చదువులు, పరిస్థితులు ప్రజలను స్వార్థపరులుగా మారుస్తున్నాయే తప్ప కల్మషరహితమైన శ్రేయోదాయకవృద్ధికి తోడ్పడంలేదు. రాజకీయ నాయకులపై, ఉద్యోగస్తులపై, తుదకు విజ్ఞాన నిధులుగా ఉండవలసిన విద్యాలయాలు, విశ్వవిద్యాలయాల పాలకులపై కూడా నిత్యం అవినీతి ఆరోపణలు వింటూనే ఉన్నాము. నేరం చేసినవాడికి శిక్ష లేకుండా చేసే మేధావులు ఎక్కువైనారు. ఇది కొనసాగితే ఈ రోజు సంబరపడే మేధావులుకూడా కుళ్ళిన సమాజంలో అతిహీనంగా కుళ్ళిపోవాల్సి వస్తుంది. చివరికి జాతి నిర్వీర్యమై అభివృద్ధి నిర్మూలనమై మనం పూర్తి అనాగరిక ప్రపంచంలోకి వెళ్ళిపోవాల్సి వస్తుంది. నాగరకతవల్ల మంచి జరగాలికాని మంచి నాశనం కాకూడదు. గోప్యంగా ఉండవలసినవి గోప్యంగా ఉంటేనే సొగసు. సెన్సారు బోర్డులలో ఆడవారు మెంబర్లుగా ఉన్నాకూడా ఆడదాన్ని అతి చులకనగాను విలాసవస్తువుగాను చూపే సినిమాలు, అశ్లీలత నిండిన దృశ్యాలు, సంభాషణలతో కూడిన సినిమాలు మన నాగరకత ఎంత వెర్రితలలు వేసిందో చెప్పక చెబుతాయి. నిత్యం కాలి బూడిదవుతున్న మనుష్యులు, బస్సులు, రైళ్ళు, ఆఫీసులు మన తెలివితేటలకి, వివేకానికి మచ్చుతునకలు.

ఈ విషమవలయాన్నుంచి మానవాళిని రక్షించేదెవరో!

—సంపాదకుడు

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

# తెలుగు సాంస్కృతిక జీవనంలో ఆధునికతా వికాసం

(గత సంచిక తరువాయి)

— శ్రీ అవంత్స సోమసుందర్

దాదాపు ఇదే కాలంలో జార్ చక్రవర్తుల నిరంకుశ పాలనలో మ్రగ్గుతున్న రష్యాలో సైతం పునరుజ్జీవన కాంతిరేఖ లందయించ నారంభించాయి. లియో టాల్‌స్టాయ్, ప్రిన్స్ క్రోపాట్కిన్, ప్లెహనోవ్ వంటి మహాపురుషులు నూతన మానవీయ మతాన్ని ప్రబోధించ నారంభించారు. రష్యన్ జార్ చక్రవర్తి నికలస్ బానిసవ్యాపారవిధానాన్ని రద్దు చేశాడు. కాని బానిసలకు మాత్రం ప్రత్యామ్నాయ జీవనాధారం అను కల్పించలేకపోయాడు భూములిచ్చి వ్యవసాయ రంగంలో ప్రవేశపెట్టలేకపోయాడు. ఈ దుస్థితి కల్ల విముక్తమైన కట్టు బానిసలు తిరిగి అనాథులయ్యారు. వేరొక ప్రక్కగా రష్యాలో పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ పెంపొంద నారంభించింది. కొత్తగా నెలకొల్పబడిన ఫ్యాక్టరీలలో పనిచేయడానికి కార్మికవర్గం అవసరమైంది. దీనితో నిరాధారులుగా ఉన్న పూర్వబానిసలు కార్మికవర్గంగా మారిపోనారంభించారు.

చుట్టుచూపునుంచి మనం మళ్ళీ ఆంధ్రదేశంలోని ఆధునికతా రంభవికాసాలకు మళ్ళిద్దాం. మహోద్యమనగధీరుడు శ్రీ కందుకూరి వీరేశలింగం ఒక యుగపురుషుడుగా దర్శనమిస్తాడు. వారి జీవన కృషి సర్వతోముఖ జాజ్వల్యమానంగా భాసిస్తుంది. 18వ శతాబ్దిలో వెలువడిన నాయకరాజులకాలంలోని మన్నారుదాస విలాసం అనే యక్షగానంలోనూ, 1860ప్రాంతంలో సంకల్పయుతంగా వచన సాహిత్యాన్ని పెంపొందించిన శ్రీ స్వామి నేన ముద్దునరసింహంగారి హితసూచనలోనూ శిష్టజనవ్యావహారిక భాషా పలుకుబడులు వీరేశలింగంగారికి ఆంతరిక దారుఢ్యం కలిగించాయి. 1878 లో రచించి, హితకారిణిలో ధారావాహికగా ప్రచురించిన తొలిప్రహసనం-బ్రాహ్మవివాహం అనే పెద్దయ్యగారి పెండ్లిలో బ్రాహ్మణ కుటుంబాల ఛాందసభావాను చిత్రించారు. సిద్ధాంతరీత్యా ఆయన లాక్షణిక భాషా పక్షపాతి అయినా, ప్రహసనరచన వచ్చేసరికి - దానిలో సామాజిక ప్రతిబింబాలు సజీవంగా ప్రచలితం కావాలన్న ఆలోచనతో తొలిప్రహసనం రూపొందించారు. వ్యావహారిక భాషనే ప్రయోగించారు.

తాను సృజించిన సాహిత్యం జడమయంగా ఉన్న సమాజ హృదయాన్ని సంస్కరించడానికే దీక్షవూనాలని యుగపురుషుడు సంకల్పించాడు. చైతన్యయుతంగా సాహిత్యం సామాజిక సమస్యలు పరిష్కరించుకునేందుకు మార్గదర్శకం కావాలన్న యోచన ప్రప్రథమంగా వారే ప్రవేశపెట్టారు. ఆయన అడుగుజాడలలో పురోగమించిన మహాకవి గురజాడ అప్పారావు గారుగాని, కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారుగాని, ఎందరో యితర రచయితలుగాని, ఇరవైయ్యో శతాబ్ది సాహిత్యాన్ని సంపూర్ణ ఆధునికంగా మలచడానికి సర్వతోముఖంగా ప్రయత్నించారు.

ఆ మహోదయంలోనే ఆంధ్ర సాహిత్య చరిత్రలో అపూర్వాలయిన ఆధునిక సాహిత్య ప్రక్రియలు తామరతంపరగా

ప్రాదుర్భవించాయి. నాటకం, ప్రహసనం, నాటిక నవల కథానిక, ఖండకావ్యం ఇత్యాదులన్నీ సంపూర్ణ నూత్న కాంతులందుకుంటూ భాసించనారంభించాయి. ఈ మహనీయులందరూ నిజానికి కటిక చీకటిండ్లలోనే పుట్టారు. వెలుతురు కోసమే అహర్నిశం పరితపించారు. జాతికుండీలు వెలిగించడానికే అవిరళ కృషిసల్పారు. అందుకే తమ బ్రతుకులూ, పరిమితమైన వనరులూ ఆనందాశయం కోసమే మాదుగట్టుకున్నారు వారితీవ్ర కృషిలో, అంతకుముందెన్నడూ ఎరుగని అపూర్వ ఓజస్వంతంగా తెలుగు సాహిత్యానికి ఆధునిక సత్తాక చేకూర్చారు.

సంఘంలోనూ, సాహిత్యంలోనూ నవీనమానవీయ సంస్కృతీ దీపతోరణం వెలిగించిన మహనీయులంతా పంతొమ్మిదో శతాబ్దంలో జన్మించినవారే! గత శతాబ్దంలో ఏడుదశాబ్దాలు గడిచీ గడవని సంజకాలంలో - మూడుపదుల వయస్సైనా చేరని వీరేశలింగం-సంఘ సంస్కరణాభిరతితో సాహిత్యాన్ని ప్రబల ఆయుధంగా మలచనారంభించారు. బ్రాహ్మవివాహప్రహసనం 1878 లోనే వెలువడి తొలిజేగంటలు మోగించింది 1890లలో రాజశేఖరచరిత్ర ప్రథమ నవలగా ఆవిర్భవించింది.

సరిగ్గా మూరేళ్ళ క్రితం - గతశతాబ్దపు చరమదశాబ్దంలో, బ్రాహ్మవివాహప్రభావంతోనే అయినా, అపురూప తేజస్నిగ్ధంగా, అపూర్వసంవిధాన చాతుర్యంతో, ఒక మహత్తర దృశ్యకావ్యంగా కన్యాశుల్కం గురజాడవారు రచించారు. అది 1892 లో రంగస్థలంపై ప్రదర్శన అందుకుంది. అప్పుడు చూసిన మహామేధావులు ఆనందగజపతి మహారాజాతోసహా కవి పండితులంతా బహుధాప్రశంసించారు. కాని గురజాడకు మాత్రం సంతృప్తికలగలేదు. ఎన్నో మార్పులూ చేర్పులూ చేసి ప్రథమ ముద్రణ 1897 లో ప్రచురించారు. మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి, హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావుగారు కన్యాశుల్కం గ్రంథంగా ఉద్భూతమైన సంవత్సరంలోనే తాము జన్మించామని సగర్వంగా చెప్పుకొనేవారు. ప్రథమ ముద్రణ వెలువడ్డాక దాదాపు ఒక పుష్కరకాలం తీవ్రకృషిసల్పి - మనమంతా నేడు కళ్ళకద్దుకు చదువుతున్న పరిశుద్ధస్వరూపాన్ని 1909 లో ప్రచురించారు. సంకల్పసిద్ధుడైన ఆమహాకవి కాలాన్ని జయించాడు. కన్యాశుల్కాన్ని మనమిప్పుడు సగౌరవంగా, గర్వంగా అధ్యయనం చేస్తున్నాము ఆ నాటక శతాబ్దిమహోత్సవం జరుపుకోగలుగుతున్నందుకు మనతరం సార్థకత పొందుతోంది. ఆ మహాపురుషుడు నెలకొల్పిన సృజనాత్మక సాహిత్యానికి ఉత్తరాధికారులుగా, ఉత్తమ వారసులుగా పురోగమించాల్సిన అవసరం ఉంది. అందుకు అర్హమైన ఆత్మోద్దీపనం చేసుకుంటున్నాం.

గిరీశంపాత్రచిత్రణగురించిగాని,మధురవాణి చతురత గురించిగాని కన్యాశుల్క నాటక పథకం గురించిగాని, అదిసాధించిన నాటకీయ ప్రయోజనం గురించిగాని, ఆనాటినుంచి నేటివరకూ ధారావాహికంగా విమర్శలూ పరిశీలనలూ వెలువడుతూనే వున్నాయి ఐనా అది యింకా తరగని గనిలా ఎన్నోసమగ్ర పరిశీలనలకు ఆకరమై నిలుస్తూనేవుంది. కొందరు మేధావులింకా తికమకలు పడుతూనే వున్నారు ఎందరో సహృదయులు ఆ మహత్తర నాటక అంతర్యాన్ని అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తూనే వున్నారు. ఇందరూ ఇన్నివిధాల కన్యాశుల్కంతో తలపడుతున్న సత్యమొక్కటే చాలు. ఆ మహాకావ్యానికిగల అజరామరశక్తిని తేటతెల్లం చేయగలుగుతుంది.

గురజాడ కన్యాశుల్కం రచన ప్రభావం సమకాలిక రచయిత లెందరిమీదనో గాఢంగా హత్తుకుంది. గట్టిగ్రాంథిక భాషావాదిగా, సంప్రదాయ బంధాలనుంచి విముక్తులుకాగల సాహసం లేనివారుగా గొప్పసాహిత్యం సృష్టించిన పానుగంటిలక్ష్మీనరసింహారావు కంఠాభరణం నాటకంలో కన్యాశుల్క ప్రభావాన్ని స్వీకరించారు. ఐతే సక్రమ అవగాహనకు దూరమవడమూ వికారపాత్రల సృజించడం ద్వారా హాస్యాన్ని ప్రోది చేశారు. కంఠాభరణం నాటకంలో పిచ్చిరామశాస్త్రివంటి పాత్రద్వారా 'కేరక్ చరిజం'ను ఆరాధించారు. సాక్షివ్యాసాలలో ఆనాటి సామాజిక వాస్తవికతను ప్రతిబింబించారు. కేవలానంద ప్రాప్తి కోసమూ తాను విశ్వసించే ద్వైతమతధర్మోపదేశం కోసమూ, పానుగంటివారు రామాయణ కథాంశాలతో నాటకాలు రచించారు. రాధాకృష్ణుల ద్వైతానుబంధాన్ని యితివృత్తంగా స్వీకరించి, పారలౌకికానుభూతిని స్థాపిస్తూ, రాధాకృష్ణ అనే మనోహర నాటకాన్ని రచించారు. జయదేవునితో ప్రాచుర్యం పొందిన, రాధాకృష్ణుల అక్రమ లైంగిక సంబంధం పచ్చిశృంగారాల వెర్రితలలువేసి, యావద్భారతీయ సాహిత్యాన్నీ కలుషితం చేసింది అశ్లీలవిశృంగారానికి అంగీకృతికలిగించింది. దానిపరవడిలో ఎన్నో ప్రబంధాలు పిచ్చితుప్పలుగా మారిపోయాయి. ఈ వెర్రిపోకళ్ళనుంచి రాధాకృష్ణుల పాత్రల సముద్ధరించాలన్న సంకల్పంతో పానుగంటి కృతకృత్యులయ్యారు. తాత్వికంగా ఉన్నతస్థాయి కలిగించారు. కాని వారే గురజాడప్రభావంతో సామాజికకళ అను నాటకానికి సామాజిక ప్రయోజనం ఉండాలన్న సత్యాన్ని విస్మరించారు. పారలౌకిక ఆనంద ముక్తే చరమప్రయోజనంగా ఎన్నుకొన్నారు.

కాళ్ళకూరి నారాయణరావు కూడా గ్రాంథికవాదే. కాని ఆయన సంఘసంస్కరణవాది. 1920 ల నాటికి ప్రబల సామాజిక సమస్యలుగా పరివర్తనం చెందిన- వరవిక్రయాన్ని, భోగస్త్రీల లంపటాన్ని, మద్యపాన భ్రష్టత్వాన్ని స్వీకరించి మూడు గొప్ప నాటకాలు విరచించారు. అవి వరుసగా- వరవిక్రయం, చింతామణి, మధుసేవ అనేవి నేటికీ ప్రదర్శింపబడుతూనే ఉన్నాయి- అవిధంగా అజరామరాలయ్యాయి.

గురజాడ ప్రభావంతో, కన్యాశుల్కం ఆదర్శంతో ఎందరో రచయితలు ఎన్నో సాంఘిక నాటకాలు రచించారు. కాని వారిలో శిల్పచాతుర్యం సమృద్ధిగా లేకపోయింది పాత్రచిత్రణా వైదుష్యం లోపించింది, అందువల్లనే ఆ నాటకాలేమీ మిగలలేదు.

ప్రస్తుతం అసంఖ్యాక ప్రజానీకం పరంపరాయమానంగా పఠిస్తున్న కన్యాశుల్క శుష్కరూపం 1910 నాటికి స్థిర రూపం పొందింది. ఆధునిక కవిత్వంలో ఉదాహరణమాత్రాలుగా నిలిచే కవితలను ఆయన 1910-13 నడిమికాలంలోనే రచించారు. 1915 లో ఆయన అవతారం చాలించారు. ఆయనతో ప్రారంభమైన నవ్యకవిత్వ పునరుజ్జీవనోద్యమం భావకవితగా పెంపొందింది పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రాణావసరమైన వ్యక్తిస్వేచ్ఛావాదాన్ని, దేశభక్తినీ, మూఢాచార నిరసననీ, ప్రాణలక్షణాలుగా గ్రహించి 1930 వరకూ భావకవిత్వం ఎన్నో విజయాలు సాధించింది.

1930 వ దశకంలో శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు ప్రభృతులు ఆధునిక కవితా స్వరూప స్వభావాలలో నిర్దిష్టమైన మార్పులు సాధించారు. ఆ దశకంలో వికసించిన కవితాస్వాదనం అంతర్జాతీయ చేతనతో కవిత్వ పరిధిని విస్తృతి మొనర్చింది. ఆ దశకంలో దాదాపు పదిమంది ప్రముఖ కవులు నవచేతనతో కవితా సృజన చేశారు, 1930లో ఆర్థికమాంద్యం ప్రపంచ దేశాలన్నిటినీ అతలాకుతలం చేసింది. 1917 లో జరిగిన అక్టోబరు విప్లవం ప్రపంచదేశాలన్నింటా తన ప్రభావ రశ్ములు ప్రసరించింది. ప్రథమ ప్రపంచ యుద్ధంలో కుంగుతున్న జర్మనీ ద్వితీయ యుద్ధంకోసం తయారీ ప్రారంభించింది. దాని పెంపును కోరుతూ సామ్రాజ్యవాద దేశాలు రష్యన్ సామ్యవాద వ్యవస్థను కూలద్రోయడానికి ప్రయత్నించడం ఉధృతం చేశారు. ఈ సకల అంతర్జాతీయ సమస్యలు తెలుగు కవుల హృదయాలను సంచలింపచేశాయి.

1939 లో ప్రపంచయుద్ధం ద్విగుణీకృత విపత్తుగా విరుచుకుపడింది. ఈ దశలోనే భారత దేశంలో అభ్యుదయక[illegible]తోద్యమం ఆరంభమైంది. 1[illegible] దశకంలో అపారకృషితో ఈ ఉద్యమం విపరీత సంచలనం సృష్టించింది. ఉత్తమ కావ్యాలను, ఇతర కళారూపాలనూ పెంపొందించింది. దాదాపు సాహిత్య స్వరూప స్వభావాలలో సంపూర్ణ అభ్యుదయాంశను సాధించింది.

తదాదిగా అభ్యుదయభావధార తెలుగు సాహిత్యంలో సుస్థిరమైంది. అవిచ్ఛిన్నరూపాన్ని సంతరించుకుంది. అంతర్గత విభేదాలు పిల్లపిలకలు ఎన్ని పొడసూపినా, స్థూలంగానూ, సార్వత్రికంగానూ శాస్త్రీయ సామ్యవాద వ్యవస్థ కోసం భావవిప్లవాన్ని ఆయత్తం చేయడానికే గత ఏభయిఏళ్ళ సాహిత్యచరిత్ర ప్రధానంగా అంకితమైంది.

ఇటీవల అంటే దాదాపు ఒకటిన్నర దశాబ్దాల లోపుగా సాహిత్యంలోనూ, సినిమా వంటి ఇతర కళారూపాలలోనూ, సెక్స్, క్రైమ్, మిస్టరీ లు ప్రధానపాత్ర వహించ నారంభించాయి. దీనితో పెట్టుబడిదారీ క్షీణసంస్కృతి విశృంఖలత్వమే ప్రధాన ధ్యేయంగా పెచ్చరిల్లింది. జాతిని కలవరపరుస్తోంది. వ్యక్తిగత హింసావాదము. లైంగిక స్వేచ్ఛాముష్కరత్వమూ నేరప్రవృత్తి ఇటు సాంఘిక జీవితంలోనూ అటు సాంస్కృతిక రూపాలలోనూ ప్రధాన ఆరాధనాస్వరూపం సంతరించుకున్నాయి. తద్వారా జాతి ఉత్తమ సంస్కారంనుంచి పతనమవుతోంది నైతిక జీవితం కలుషితమవుతోంది.

ఐతే ఒక స్పష్టమైన భాగ్యయోగం లేకపోలేదు. నేడు వస్తున్న సాహిత్యమంతా క్షీణ క్షుద్ర సాహిత్యమే కాదని మనం స్పష్టపరచుకోనక్కరలేదు. శ్రమజీవన సమస్యలతో ఎతో ఉదాత్తశిల్ప వైఖరులతో కథలు, నవలలు వెలువడుతునే ఉన్నాయి. కవిత్వంలోమాత్రం ఎన్నడూ కాలుష్యం ఏర్పడలేదు. కనుక దానిగురించి యిక్కడ ప్రస్తావించడం లేదు. కాని నేటి పెట్టుబడికి పుట్టిన వార్తాపత్రికలు విపరీత ధనాపేక్షతో క్షీణ క్షుద్ర-కుక్కగొడుగుల సాహిత్యానికే ఆదరణ ప్రోత్సాహాలందిస్తోంది. పాఠకులకు హెరాయిన్, కొకైన్ల కన్న విషపూరిత మాదకద్రవ్యం అక్షరాల ద్వారా అందిస్తున్నాయి. ఇవే ప్రధానంగా అనూచానంగా పరిఢవిల్లుతున్న మన ఉత్తమ సంప్రదాయాలనూ సంస్కారాలనూ మంట కలుపుతున్నాయి. వీరేశలింగం, గురజాడల వారసత్వాన్ని కళంకిత మొనరుస్తున్నాయి. ఇదే విస్పష్టమైన సాహిత్యభ్రష్టాచారం!

వేరొక దిశగా, అంతకన్న విరివిగా, ఉత్తమ సాహిత్యం వెలువడుతోంది. పరిగణనీయప్రాముఖ్యత నందుకుంటోంది.

ముఖ్యంగా ఆధునిక కవిత్వం ఎనభైవ దశకంలో ఒక అనిదం పూర్వ స్వర్ణయుగాన్నే సాధించింది. డబ్బయిల దశకంలో విరసం ప్రాదుర్భావంతో అకవితా దుర్గంధం ప్రచలితమవుతున్న దశలో- ఇస్మాయిల్ చెట్టు నా ఆదర్శం, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ వెలుతురుపిట్టలు శేషేంద్రశర్మ మండేసూర్యుడు వంటి ఉత్తమ కవితాగ్రంథాలు సక్వత్తుగానే వెలువడి- జాతినిఅవి ఆలోచింపచేశాయి. ఈ కావ్యశ్రేణి నెలకొల్పిన ఉత్తమ సంప్రదాయం ఎనభైల దశకంలో తామరతంపగలుగా పురోగమించింది గడచిన దశాబ్ది ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగంగా ప్రబుద్ధమైంది.

విషము సాహిత్య విషవలయంలో వికారతాండవం చేస్తున్న వెర్రిపీరుల రాండోళ్ళ చప్పుళ్ళలో మంచి కవితా కళనాదం సామాన్యుల చెవులకు సోకడం లేదు. కొత్తగా సాహిత్య పాఠకులుగా రూపొందుతున్న అర్భకులను, ఈ దుష్టసాహిత్యమే చప్పున ఆకర్షిస్తోంది. నిరంతర దీక్షతో అభ్యుదయ సాహిత్యాన్ని సృజించిన శ్రీ మహీధర రామమోహనరావువంటి కురువృద్ధులు దుష్ట సాహిత్యాంగాలపై ఖడ్గచాలనం చేయడం మాని ఉదార వైఖరితో ఉపేక్షిస్తున్నారు. నినాదాలు కడికట్టు మాటలు, ధర్మోపన్యాసాలు, అభ్యుదయ సాహిత్యంలో పెరిగిపోవడానికి ప్రతిక్రియగానే ఈ సాహిత్య కాలుష్యం దాపురించిందని భాష్యాలు చెప్తున్నారు. ఇలాంటి పెద్దలకు, పైన పేర్కొన్న బుణ్రధువాళ వల్ల ఇప్పుడే యింత ద్వేషం ఎందుకు కలిగిందో అర్థంకాదు. ఇలాంటివారంతా, ఉత్తమ సాహిత్యంకోసం తడుముకుంటున్న దశనుంచీ నినాదప్రాయ సాహిత్యాన్ని అందిస్తూనే ఉన్నారనీ, ఊదరకొడుతూనే ఉన్నారనీ ఎవరూ విస్మరించలేదు.

ఇలాంటి అలసత్వాలు ప్రముఖరచయితలలో కలగడానికి కారణం కూడా బూర్జువా విషవలయమే! అదే బుద్ధిపూర్వకంగా కాలకూట సంస్కృతిని రూపొందిస్తోంది. నిశితంగా ద్వేషించకుండా ఉదారవైఖరుల ప్రోదిచేస్తోంది. సంశయాత్మలను పెంపొందిస్తోంది. పెద్దమనిషి తరహా రాజీమాటలతో రామాస్వస్తి-రావణాస్వస్తి అనే ద్వంద్వవైఖరుల నవలంబింపచేస్తోంది. కనుకనే యీ వైఖరులు తక్షణ ప్రమాదకరాలనీ, పరిత్యాజ్యాలనీ నొక్కి చెప్పవలసివస్తోంది.

ఏమైనా కాలోహ్యం నిరవధి! ఇరవయ్యో శతాబ్దం మరో ఎనిమిదేళ్ళలో సెలవు తీసుకోబోతున్నది. ఈ చరమ దశాబ్దిలో బ్రతుకుతూ సకల పరిణామాలకూ, సరవిపరిణామాలకూ సాక్షిభూతులమైన మనం- ఆగామి శతాబ్దికి ఆహ్వాన గీతం వినిపించే పరమ బాధ్యతకూడా వహిస్తున్నాము. ఆగామి సాహితీలోకానికి ఉత్తమవారసత్వాన్ని అందించడమే పరమ బాధ్యతగా స్వీకరిస్తున్నాము. ఈ చరమసంధ్యలో నిలచి మన మొకసంగతి ధీమాగా చెప్పకోగలం.

ఆధునిక కవితారీతి ఆవిర్భవించి కవిత్వాన్ని జాతిపరం చేసింది. అసూర్యంపశ్యగా బ్రతికిన సాహిత్య సుందరికి నాలుగు వీధులూ చూపించింది గతిదినాల తలపోతలను మచ్చుకైనా ప్రతిధ్వనించడం మానుకుంది. విద్యాధికులంతా కవితారసజ్ఞు లవుతున్నారు. కవితారసజ్ఞులు అనతికాలంలో కవులుగా ఆకృష్టు లవుతున్నారు. స్వజనోత్సవపథం తెను నాళ్ళవలె క్రిక్కిరిసి సాగుతోంది. ఇంతకన్న జాతి కోరుకోదగిన రసజ్ఞతా వాతావరణంలో ఆరోగ్యపు వాకిళ్ళు తెరుగా ఉండవు.

వర్తమానాధునిక కవిత్వం సాధిస్తున్న సకల విజయాలకూ మాతృత్వం వహించినది భావకవితాయుగమే. ఇంతవరకూ సమీక్షించిన యీ శతాబ్ది స్థూలచరిత్రలో భావకవిత్వం గురించి నామమాత్రంగానే స్పర్శించి వదిలాను. ఇకముందు భావకవిత్వం సాధించినవిజయాలను పరామర్శించుకుందాము. ఇరవయ్యో శతాబ్దపు సాహిత్యంలో- గత పది శతాబ్దాలలోనూ జరగనంతటి సృజనాత్మక కృషి జరిగింది. అనేక ప్రయోగశాలితతో అసంఖ్యాక సాహితీ ప్రక్రియలు ప్రవర్ధిల్లాయి. ఒక్క యిరవయ్యోశతాబ్ది సాహిత్యచరిత్ర సమీక్షించదలచినా, వెనుకముందులూ, వంకరటింకరలూ తప్పవు. ప్రక్రియాపరమైన చారిత్రక సమీక్ష చేయడంలో యిది మరీ తప్పనిసరి! ఏమైనా నా దృక్కోణంనుంచి ఈ శతాబ్ది సాధించిన సకల సాహిత్య విజయాలనూ చారిత్రకంగా సమీక్షించడానికే ఈ వ్యాసం ఎత్తుకున్నాను.

మనం చకచ్చకితమైన సుందరలోకంలో జీవిస్తున్నాం. గత శతాబ్దాలలో ఎన్నడూ అందుకోలేని వేగవంతమైన లోకంలో జీవిస్తున్నాం. ఆధునిక విజ్ఞానం కార్తికజ్యోత్స్నగా సర్వత్రా పరచుకుంటున్నది. సమిష్టిస్వేచ్ఛా బృందావనిగా రూపొందుతున్నది. సార్వత్రికంగా ఒక అత్యంత వినూత్న జీవనతంత్రి మ్రోగుతోంది. ప్రగతిపథంలో దాని ప్రకంపనాలు నింపుతోంది. కులమత సంకుచిత విషవీచులకు మేధాహృదయం దూరంగా నిలుస్తోంది. మన పురాతన సమాజంనుంచి పరిశుభ్ర పరిమళభరిత ఆధునిక సమాజం ఆవిర్భవించేందుకు కృషి సాగుతోంది. సర్వులకూ వాసయోగ్యమైన సుందర వ్యవస్థ నిర్మించాలన్న దీక్ష సర్వత్రా దర్శనమిస్తోంది. వర్తమానకాలాన్ని తనుత్రాణంగా ఉపయుక్తం చేసుకోవాలన్న

కాంతి సామాన్యమైనదికాదు. 'పాడు కాలం పాడుకాలం!' అని తిట్టుకుంటూ బ్రతికే దుఃఖభాజనులకు ఈ మాట స్ఫూర్తివంతం కాకపోవచ్చు.

నిజమే మరి, వర్తమానలోకం సకల సంఘర్షభరితంగానే ఉన్నది. ఎక్కడ చూసినా అమానుషత్వమే జోరు తేస్తోంది. ఈ అస్తవ్యస్తపరిస్థితిని చూసి భయపడి ఎవరూ ఎక్కడికీ పారిపోలేరు. ఇక్కడే ఆగి, ఈ దుర్వ్యవస్థను మార్చడానికో, పరిమార్చడానికో తీవ్రకృషి సలపక తప్పదు. అందుకే మనం ఆరంభం దగ్గరకే వచ్చి, ఆగి పునరాలోచించుకోవాలి. కాలం మారడం, అందునా మంచి వైపుకు మారడం అనతికాలంలోనే జరగాలని అందరమూ ఆత్రంగా తలుపులు బార్లా తెరచి నిరీక్షిస్తున్నాం. ఆధునిక యోచనాధార సారభూతంగా అందిస్తున్న సందేశం స్వాగతించమనే! అదే జీవద్వంత పురోగమనశీలం!

(ఈ వ్యాసాన్ని, యికముందు వ్రాసే యీ గ్రంథాన్ని పరమ పూజ్యమిత్రులు స్వర్గీయ శ్రీ బులుసు సీతారామశాస్త్రి గారి పవిత్ర స్మృతికి అంకిత మిస్తున్నాను.– రచయిత)

* * *

అవంత్స సోమసుందర్,
కళాకేళి నికేతన్,
పిఠాపురం-533 450.
తూ॥గో॥జిల్లా, A. P.

( * * )



# రాయప్రోలు లలిత - సమీక్ష

—డా॥ ఎ. పద్మజాం, M A.M.Phil.,Ph D ,

రాయప్రోలు సుబ్బారావు 1892 మార్చిలో జన్మించారు వీరి భార్య వరలక్ష్మి. వీరికుమార్తె లలిత. ఈమె ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి శ్రీమతి. రాయప్రోలు సుబ్బారావుగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖలో ఆచార్యులుగా పనిచేశారు. రాయప్రోలువారికి 'కోకిలస్వామి' అనే బిరుదుంది.

రాయప్రోలు సుబ్బారావు తెలుగు కవుల గళాన్ని సవరించి కల కూజితాల్ని పలికించేందుకు ప్రారంభకులైనారు. రాయప్రోలు వారు ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో భావకవిత్వానికి ఒక ముఖ్య లక్షణమైన ఆత్మాశ్రయ ధోరణికిపాదులు తీసి కొత్తబారులు తీర్చిదిద్దిన కవిశేఖరుడు. భావుకతల నోటకు తొలి తోటమాలి. విశ్వకవి రవీంద్రులు అందించిన నవ్యభావవైఖరి, పాశ్చాత్య సాహితీధోరణుల పరిజ్ఞానమూ రాయప్రోలు వారికి మౌలికమైన ఆలోచనారీతిని అలవరచినాయి. అతివేల శృంగారం రాజ్యం చేస్తున్న దినాల్లో 'అమలిన శృంగార' సిద్ధాంతానికి శ్రీకారం చుట్టినవారురాయప్రోలువారు. 'లిరిక్కులోని అనురాగము మన కావ్యములలో వలె సంభోగపరిణామమూ పొందనక్కరలేదు. విషయేంద్రియ భోగముగాక భావాత్మకమైన స్నేహయోగంగా పరిణత మౌతుంది. దీనిని అమలిన శృంగారమని సంకేతించితిని." అని రాయప్రోలు వారు 'తృణకంకణం' పీఠికలో చెప్పారు. శృంగారానికి 'శుచి' అనే నామాంతరాన్ని, దానిస్థాయిభావమైన రతికి 'ఆనందం' అనే వైశాద్యాన్ని వీరు స్వీకరించారు. శృంగారాన్ని, ప్రేమ, మమత అనురాగం, స్నేహం, ప్రణయం అనే విశేషార్థాల్లో ప్రయోగించాడు. ఆంగ్లంలోని 'లిరిక్కు'ల్ని తెలుగులోకి తెచ్చిన మొట్టమొదటి ఆధునిక కవి రాయప్రోలు. వీరి తృణకంకణం దీనికి ముఖ్యోదాహరణ. రాయప్రోలు వారు ఉగాదివంటి పండగల మీద, కోయిల, పులివిస్తరాకు వంటి వాటిపై పద్యాలు రాశారు. దేశభక్తి కవిత్వానికి ఒరవడి పెట్టింది వీరే. భావ ఒక కొత్త బాట వేసి 'Romantic-Revival' గా దాన్ని ప్రచారం చేసిన తొలితెలుగు కవి రాయప్రోలు. కాబట్టి భావకవులకు యుగకర్త రాయప్రోలు వారే

రాయప్రోలు రచనలు :–

రాయప్రోలు సాహిత్యం ప్రధానంగా మూడు శాఖలు. అవి 1. అనువాద సాహిత్యం 2. స్వతంత్రసాహిత్యం, 8. వ్యాఖ్యానసాహిత్యం.

1. అనువాదసాహిత్యం –

వీరి అనువాద సాహిత్యం ఆంగ్లం నుండి, సంస్కృతం నుండి అవతరించింది. సాధారణంగా తెలుగుసాహిత్యం మొదట సంస్కృతంనుండి, తర్వాత ఆంగ్లంనుండి అనువదించబడింది. కాని రాయప్రోలు ముందు ఆంగ్లంనుండి, తర్వాత సంస్కృతంనుండి అనువదించాడు. అవి - i) లలిత(1909) ii) అనుమతి (1910, iii)

మిశ్రమంజరి (1963) iv) ఉత్తరరామ చరిత (1958 v) సుందరకాండ (1973) vi) రాసపంచాధ్యాయి (1975) vii) సౌందర్యలహరి, దూతఘటోత్కచము, మధుకలశము, భజగోవిందం.

## 2. స్వతంత్ర కవిత్వం:-

తృణకంకణం, స్వప్నకుమారము స్నేహలతాదేవి. కష్టకమల, ఆంధ్రాభిమానంతో ఆంధ్రావళి, తెనుగుతోట అనే వాటిని, శృంగార దృష్టితో ప్రకృతిరమణీయకత సృష్టిలోజడకుచ్చులు. కన్నెపాటలు అనేవాటిని రాశాడు. వీరి 'మిశ్రమంజరి' చూడదగింది. 1963లో ప్రకటితం.

## 3. వ్యాఖ్యాన కవిత్వం :-

మాధురీ దర్శనము, రమ్యాలోకము అనేవి వద్యమయమైనప్పటికీ రాయప్రోలు కావ్యాలమీద విమర్శలకు ప్రతివిమర్శలు. ఇవి అతని కావ్యాల మౌలిక తత్వాన్ని వివరించే గ్రంథాలు.

రాయప్రోలు సుబ్బారావు వస్తుభావ రచనలో అనేక నవ్యమార్గాల్ని చూపి ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలో కొన్ని రీతులకు, వంగవైష్ణవ సంప్రదాయాలకు, అమలిన శృంగారాది నూతన సిద్ధాంతాలకు, కథాకావ్యాది అనేక ప్రక్రియలకు, దేశభక్తి కవిత్వానికి మార్గదర్శకుడైనాడు.

రాయప్రోలువారికి చిన్ననాటినుండీ సాహిత్య వాతావరణ మేర్పడింది. వీరిమేనమామ అవ్వారి సుబ్రహ్మణ్యంశాస్త్రిగారి సాహచర్యంతో వీరికి చిన్నప్పుడే ఆశుకవిత్వం, అవధాన చాతుర్యం అలవడింది. శాస్త్రిగారితో కలిసి అవధానాలుగూడ రాయప్రోలు నిర్వర్తించారు. రాయప్రోలు వారు గుమగుమలాడే కొతిమీర చేలమీద, కుండ పొదుగులతో భారంగా నడిచే చూడిఆవులమీద, ఊరి చెరువుల్లోనుండి నీళ్ళు మోసుకునిపోయే గ్రామభామల మీద తొలిరోజుల్లో కొన్ని పద్యాలు రాశారు.

## లలిత :

రాయప్రోలు సుబ్బారావు 1908-09 కాలంలో రాజమండ్రిలో విద్యాభ్యాసం చేశారు. ఆంధ్రకేసరి పత్రిక సంపాదకులైన చిలుకూరి వీరభద్రరావు, అత్తిలి సూర్యనారాయణరావు ప్రోత్సాహంతో రాయప్రోలు 'జాతీయోద్ధారకులు' అనే వ్యాసం రాశాడు. ఆకాలంలో న్యాయవాదిగా వుండి సాహిత్యవేత్త అయిన గంటి లక్ష్మన్నపంతులుగారి పరిచయం రాయప్రోలుకి కల్గింది. గంటి లక్ష్మన్న గారు గోల్డ్‌స్మిత్ రాసిన 'హెర్మిట్ (Hermit)' ని చదివి దీనిని తెలుగులో పెట్టండి అని ఆదేశించారట. ఆంగ్లంలోని హెర్మిట్ తెలుగులో 'లలిత'గా మారిపోయింది. ఒక వియోగిని విలాపంగా వెలసింది 1909లో లలితకావ్యరచనతో రాయప్రోలు జీవితం కొత్తమలుపు తిరిగింది. రాయప్రోలు వారితర్వాత కావ్యాలన్నిటికి బీజాలనదగిన అభిప్రాయాలు భావనారీతులు 'లలిత'లో ఉన్నాయి. అయినా 1912లో పునర్ముద్రణ జరిగేదాకా యిది సాహితీపిపాసుల దృష్టిని అంతగా ఆకర్షించలేదు.

తొలిముద్రణలో 136 పద్యాలున్నాయి. రెండో ముద్రణలో 156 పద్యాలైనాయి. 1912లో వెలువడ్డ రెండో ముద్రణకు రమాకాంతాచార్యులవారు ఇంగ్లీషులో ప్రవేశిక రాశారు. చెళ్ళపిళ్ళ వారు తెలుగులో అభిప్రాయం రాశారు. చెళ్లపిళ్ల వారు లలిత నవ్యకావ్యమని యిలా చెప్పారు.

"ఇందు కథాముఖము పురాతన కావ్య సంప్రదాయముల ననుసరింపక నాయికా విలాపముతో ప్రారంభమగుచున్నది... ఇందలి యితివృత్తము హూణకవి కృతి నుండి గైకొనబడినది. కాని యందలి వర్ణనములు స్వకపోల కల్పితములే".

రమాకాంతాచార్యులవారు పీఠికలో, లలితకావ్యం ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో చతురంగా రాయబడ్డ మొట్టమొదటి తెలుగు కావ్యమని అభిప్రాయపడ్డారు.

"This poem, which I have been priviliged to introduce to the literary Public of Andhra world, is, I believe, the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the sacred passion of love under the direct inspiration of the rotaries of English Muse and as such, marks a new epoch in the development of modern Telugu literature"

రాయప్రోలుకు ముందు ఇంగ్లీషు కవుల కావ్యాల్ని అనువదించినవారున్నా వారి రచనలు మౌలికభావసంపత్తి లేనందువల్ల ఆంధ్ర సాహిత్యంలో నవోన్మేషం కలిగింపలేకపోయాయని, ఈ కవి అలాకాక ప్రకృతిలోనుండి సూటిగా అనుభూతుల్ని చేసుకొని, వాటిని శబ్దచిత్రాలుగ మార్చి తన కావ్యంలో ప్రవేశపెట్టి కొత్త జీవం పోశాడని రమాకాంతాచార్యులు అభిప్రాయపడ్డారు ప్రబంధ కవిత్వంలోని పారంపరికమైన పదాడంబరాన్ని, కృత్రిమశైలీ విన్యాసాన్ని రాయప్రోలు త్యజించి నవ్యత కనబరచాడని రమాకాంతాచార్యులు రాశారు. ప్రకృతిని అత్యంత రమణీయంగా రాయప్రోలు చిత్రించారని రమాకాంతాచార్యులవారు ఇలా చెప్పారు.

"The crystal stream, the limpid lake, the crimson twilight, the starlit night, the rosy morning, the melting mist the flowery creepers, the reddened blossoms, the warbling birds, the humming bees, the grazing fawns, which from the object of some of the poetic descriptions conjure up a scene of great picturesqueness".

రమాకాంతాచార్యుల వారి అభిప్రాయంలో లలిత మొట్టమొదటి నవ్యకావ్యం. కాని కల్లాకజ్ఝల మొదలైనవారు. 'తృణకంకణమే నవ్యకవిత్వమునకాదిగ్రంథ'మని అభిప్రాయపడ్డారు. అదీగాక 'లలిత' ఆంగ్లంనుండి అనువదింపబడింది కాబట్టి నవ్యకావ్యం అనేందుకు కొంత సందేహించవలసిఉంది. అయితే ఆచార్య సినారె గారు "లలిత"ను ప్రప్రథమ నవ్య కావ్యమని ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు; ప్రయోగములు' అనే సిద్ధాంత గ్రంథంలో వివరించారు.

లలిత - కథ :-

ఇది గోల్డ్‌స్మిత్ రాసిన Hermit కి ఆంధ్రీకరణ. ఇది నాయికా నాయకుల విరహంతో ప్రారంభమౌతుంది. వియోగ శృంగారమే దీనిలోని అంతస్సూత్రం. రాయప్రోలు నవ్యకవిత్వానికిది తొలి మెట్టు. జన్యానుబం సంసారంలోని అనురాగ మాధుర్యాన్ని చూరగొనాలి కాని వైరాగ్యంతో సన్యాసం పుచ్చుకొని అడవుల వెంటబడిపోరాదని చెప్పడంతో దయతీనిష్ఠమైన ధర్మమే శ్రేష్ఠమనిపిస్తుంది. దంపతీనిష్ఠమైన ప్రణయంద్వార ఒక పర మార్గాన్ని ఆశించినప్పుడు అదిపవిత్రమౌనని రాయప్రోలువారి కావ్యసందేశం.

'లలిత'లోని కథ స్థూలంగా- పాంథుడొకడు వియోగహృదయంతో విషాదభావాల్ని ప్రకటించుకుంటూ అడవిలో తిరుగుతుంటాడు. కొంతసేపటికి 'శాంతనివాసంబుగనున్న ఒక్కముని' ఆ పాంథుణ్ణి పలకరించి సాదరంగా ఆహ్వానించి ఊరట కలిగేటట్లు మాట్లాడుతాడు. రాత్రి తెల్లవారుతుంది. అప్పుడు ముని రూపానికి, వనసౌందర్యానికి ముగ్ధుడౌతాడు. ముని పాంథుని దుఃఖానికి కారణం అడుగుతాడు. పాంథుడు తన కథంతా ఇలా వివరిస్తాడు. తాను పథికుణ్ణి కాననీ, జయపాలుడనే రాజుకి కుమార్తెనని, తనపేరు లలిత అనీ, తాను మనసార వలచిన సత్యవర్ధనుడు నిరాశుడై అడవుల కల్గాడనీ వివరిస్తాడు పాంథుడు. తనప్రియుడు లేని జీవితం వ్యర్థమని దుఃఖిస్తున్న ఆ స్త్రీని మునివేషంలోఉన్న యువకుడు హార్దికంగా కౌగిలించుకుంటాడు. మునివేషంలో ఉన్నవాడే సత్యవర్ధనుడు. పాంథుని వేషంలో ఉన్నది లలిత. ఏరిరుపురు. ఆనంద తరవశులై తనివితీర విహరించారు.

లలిత_అనువాదవిధానం_

మూలంలో కథ పాంథునివిలాపంతో రెండు స్టాంజాలతో ప్రారంభమౌతుంది.

"Turn, gentle Hermit of the dale  
And guide my lonely way  
To where you taper cheers the vale  
with hospitable ray.  
For here forlorn and lost I tread  
with fainting steps and slow  
where wilds, immeasurable spread  
Seem lengthening as I go.'

ఈవాక్యాలతో పాంథుని విలాపం ముగిసింది. వెంటనే మునిసమాధానమిచ్చినట్లు చిత్రింపబడింది. కాని తెలుగులో రాయప్రోలు వారు 33 పద్యాల్లో పాంథుని హృదయవేదనల్ని విపులంగా వ్యక్తీకరించారు. పాంథుని విరహబాధ ప్రబంధరీతిలో చిత్రింపబడింది. అతనికి దప్పిక కలిగినట్లు సరోవరంలో నీళ్ళుతాగి దప్పిక తీర్చుకున్నట్లు కల్పించారు రాయప్రోలు ఈసందర్భంలోనే సరోవరవర్ణన,సూర్యాస్తమయవర్ణన, సంధ్యారాగవర్ణన,తారకావర్ణన ప్రవేశపెట్టబడ్డాయి.

'ఓ సుగుణాలవాల! కుసుమోదయ  
చారు వయోరసాల! శీ  
లా సుకుమార! హారతరలస్మిత  
పూర్ణకళాలయాస్య! వా  
చాసకలార్థ సాధక విలాస!  
దయాధవళాంతరంగ! ఆ  
హా! సఖి! నన్నువీడనగునా?  
తగునా తరుణీ! కఠుల్.

నాటినగాట పుష్పాలపు నంబడి,  
నాల్గుదినంబు లీదురం  
తాటవిలోన ద్రిమ్మరితి, నంతములేని  
నదీ నదంబులన్  
దాటితి, నచ్చటచ్చట వెనంబడి  
కాలిడరాని కంచెలం  
దోటమి లేకయే తిరుగ నొప్పితి,  
కప్పిన మోహపుందమిన్.

తాలిమి దూలి, కన తలిదండ్రుల మాలి,  
వియోగ వారిధిన్  
తేలి, హితా హితంబులు గణింపగనీయని  
ప్రాయపుప్పొగన్  
సోలి, వచింపజాలని మనోథరమున్  
సహియించి తాళగా

బాలక, ఇందు వచ్చితివి జాలము కేలర?
ఏలరా చెలీ!

బాలుక రొండెడిన్, మానమునన్
పగతూలెడి, ముందు పోవగా
కాలుకదల్పనేను, వడకన్ దొడగెన్
తనువెల్ల, త్రాగనీ
క్ష్మాలభియింప కీపెడ పాలాన,
పురోగమనాభిలాష చిం
తాలసమయ్యె, నిట్టుడవి నా తప
తాపహతిన్ కృశించుటల్.'

ఆటవికుల నుద్దేశించి పాంథుడు తనను కాపాడవలసిందిగ రోదించినట్లు చిత్రింప బడింది.

ఆ తర్వాత మూలంలో ఉన్నట్లు ముని సాంత్వనోక్తులు చేర్చబడ్డాయి. మూలంలో, ఆ రాత్రే ముని పాంథుని దుఃఖానికి కారణం అడిగినట్లుంది. తెలుగులో మర్నాడు ఉదయం ముని కాలోచిత కృత్యాలు తీర్చుకునివచ్చి దుఃఖానికి కారణమడిగినట్లు మార్చబడింది. ఈలోపల ప్రభాత వర్ణన ప్రభాకర, వర్ణన, మునిముఖం చూసినపుడు పాంథుని మనసులో కలిగిన వికారవర్ణన, వనవర్ణన రాయప్రోలు వారు చేర్చారు.

'కని యా చల్లని కోలకున
తనివోవగ నీరు త్రావి దగ ఒడలికి తూ
లిన కొంత రేటి తెరలుచు
తనలోన దొడంగె నిట్లు తలపోతలకున్.

వలచిన వన్నెలాడొకడు
భగ్నమనోరథుడై త్యజింపగా
తలరుచు, తర్వియోగ పరితాప
భరాపనయార్థి మొంటి మై
నలత వనంబుచేర, అడియాసల
గాసిలు పాంథుచూచి, కాం
తిలెవనగా. ఇనుమంతలి దీధితి
త్రావెలెను పశ్చిమాద్రిపై.

బాలకి సాలయస్మృదుల భాపిలు
భాగ్యవతీ వదాంఘ్రిలా

ఝాలలిత ప్రతీతిని వికావిక నవ్వి,
నవ ప్రసూత కాం
బూజ రసాయనాఘం విధూతిని కావని,
కుంకుమార్చనా
శ్రీలను నోలలాడినట వృద్ధ వికర్తన
సాంధ్య వర్తనల్.

ఇక తాళించు కులాయ కోలముల,
హాయిన్ తూగుటుయ్యాలలూ
గెవనీ క్రాంత శకుంత సంతతులు,
సంగీతంబులై యుయ్యెడన్
దివసారంభ మహోత్సవాభిముఖ
నాందీ దేవతా మంత్రగా
స్తవముల్ సల్పెడి నోయనన్ శ్రుతి
నిరుక్త స్వాను కంఠంబులన్.

మూలంలో పాంథునితో మునిమాట్లాడిన విధం యిలా ఉంది—

నీవు ఇంటి నుండి వెడలగొట్టబడ్డావా? ఎవరినైనా ప్రేమించావా? ప్రేమ పేరుకే. అది కేవల వినోదం, నిజమైన ప్రేమ ప్రపంచంలో లేదు, ఉంటే అది పక్షుల్లోనే (పావురాలు) వుంది. యువకుడా! నీ బాధ ఉపశమించుకో స్త్రీలను తోసివేయి—అని ముని అంటాడు. అందుకు పాంథుడు బాధపడుతూ తాను భగ్నహృదయుణ్ణనీ, టైను నదీ తీరంలో నివసించే తండ్రికి ఒకే కుమార్తెననీ, ఎంతో మంది తనను ప్రేమిస్తే తానొక సుందరుణ్ణి ప్రేమించినానని, అతడు హిమంవంటి, సుమంవంటి పవిత్రహృదయుడనీ, అతన్ని నేనే గర్వంతో చంచల స్వభావంతో ఉడికించానని, అతడు నిరాశాహతుడై వెళ్లాడనీ. అందుకు పశ్చాత్తాపనైనానని, అతనికోసం మరణించడమే తన కర్తవ్యమని పాంథునిరూపంలో ఉన్న పడతి చెబుతుంది. ఇది విన్న ముని కుమారుడామెను కౌగలించుకుంటాడు. ఆమె ఆశ్చర్యంతో పెనుగులాడి చివరకు తన ప్రియుడైన ఎడ్విన్ అని తెలుసుకుంటుంది

ముని పాంథుని సంభాషణలో—రాయప్రోలువారు కొన్ని మార్పులు చేశారు. ముని మొదట పలకరించినపుడు పాంథుడు దుఃఖిస్తాడు. ముని అతణ్ణి ఓదారుస్తాడు. దైవసృష్టి అగోచరస్థాయి కలిగిఉంటుందనీ, ప్రేమ పరిణామం అనంతముఖ విస్ఫుటమైందనీ, ప్రేమే మోహంగా, వాత్సల్యంగా, స్నేహంగా అవస్థాభేదాన్ని బట్టి రూపొందుతుందని తెలిపి ప్రణయ రహస్య తత్త్వాన్ని ముని బోధిస్తాడు. అపుడు పాంథుడు తన విషయాన్ని ఇలా చెప్తాడు. తాను పుట్టిన కొన్నాళ్ళకే తల్లి మరణించిందనీ. తన తండ్రి జయచంద్రుడని తానొక హృదయమోహనున్ని వలచానని, అతని 'సహవాసమభిలషించి త్రికరణ విశుద్ధముగ తీపి, తీపి నోపి 'నిశాంత పద్మిని విధాన మెలగుతున్నా'ననీ, తన వలపు 'వృథా వ్యథ అయిందనీ, వలచిన వన్నెలాడడవి పట్టినాడనీ, పతి లేనికొమ్మయిన నావంటి వనిత' ఉండీఫలితం లేనందున మరణించాలని నిశ్చయించుకున్నానని పాంథుని రూపంలో ఉన్న లలిత చెప్పింది. వెంటనే ముని పాంథుని రూపంలో ఉన్న లలితను కౌగలించుకుంటాడు. ఆమె చలీకృతకురంగిక' లాగ. 'సమీప కాల్మలీ ప్రాంతము చాటునంది 'అగ్రహరోష కషాయ రక్తిమల్', 'నవారుణాధరము కాంతుల పంతములాడ' ముని కుమారుణ్ణి నిందిస్తుంది. 'కన్నుల నస్నరక్త' బిందువులు చిందగా ఉపాలంభిస్తుంది. అపుడు ముని కుమారుడు తాను సత్యవర్ధనుడని చెప్పి 'లలితా' అని పిలుస్తాడు. ఆమె అతని 'మోమును గని రూపురేఖలను పోల్చి', 'చెలిమినా

తని కౌగిట చేర్చు కుంటుంది. కావ్య 'ప్రణయవ్రత దీక్ష' ఈ విధంగా ఫలించింది.

మూలానికి మెరుగులు :-

రాయప్రోలు వారు మూలానికి తన రచనలో మెరుగులు పెట్టారు. ఆశ్రమంలో ముని, పాంథునితో "వన్నె పిశాచమని శంకింపకు విధికృతిలేకముచే నిరాశ మారందము నాచరించెడి విరక్తుడ గాని మరొండు గాను మా' - అని అన్నపుడు సత్యవర్ధనుని వృత్తాంతం ధ్వనిస్తుంది. 'వలిగిన నలినము గతి మెలుగులు మాని మాదుగ' నీవు కోమలముఖువు అన్నపుడు పాంథుని స్త్రీత్వము ధ్వనిస్తుంది. 'కిశోర హారిణి కరణి దుర్గమ స్థలమున్ కలయద్రిమ్మరెద' అన్నప్పుడు 'హారిణి' శబ్దం స్త్రీవాచకం కావడం ఇందులోని చమత్కారం.

మూలంలో మున్యాశ్రమంలో పిల్లిపిల్ల పయ్యాటలాడుచున్నట్లు, గడ్డిపురుగు కుంపటి చుట్టూ కిచకిచమన్నట్లున్న వాతావరణాన్ని రాయప్రోలు త్యజించి, మూలంలో లేని కురంగ క్రీడలం ప్రవేశపెట్టి ఆశ్రమవాతావరణ వర్ణనానికి ఔచిత్యాన్ని కూర్చారు. మూలంలో లేని వన వర్ణన కథకు ఉపస్కారకంగా ఉంది. వనం వేదాంతి మనసులాగ, కలితలేని విశ్రాంత సరస్సులాగ శుక ముఖాక్షర రమ్యకథాము లాపలీలాధరమై ఉన్నట్లు వర్ణింపబడటం వల్ల శాంత రస పోషణకు అవకాశం ఏర్పడింది. కథంతా వనంలో జరిగినట్లు వర్ణితం. నాయకుడైన ముని పర్ణశాలలో ఉండటం అతని వేషమే గాక మనసు కూడ సత్యదీపకంగా ఉంది. నాయిక ప్రియవియోగంతో వైరాగ్యోన్ముఖమై ఉంది. 'కావ్యంలో వియోగ శృంగారంతో పాటు శాంతం కూడ ఉంది కాబట్టి వనవర్ణన దానికి అనుగుణంగా వర్ణింపబడటం విశేషం. 'రాయప్రోలు వారు చేసిన ముఖ్యమైన మార్పిది' అని సి. నారాయణరెడ్డిగారు ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయములు, ప్రయోగములు (పు. 254) లో చెప్పారు.

మూలంలో:-

'For still I tried each
fickle art,
Importunate and vain,
And while his passion
touched my heart
I triumph'd in his pain'

-అన్నట్లు నాయిక అనవసరంగా నాయకుణ్ణి ఆడించి ఆనందించినట్లుంది. కాని రాయప్రోలు తన రచనలో లలిత సత్యవర్ధనుణ్ణి మనస్ఫూర్తిగా ప్రేమించినట్లు 'హిమపదకపానమున చెలువెనయనున్న మారుతాగమ మీక్షించు మల్లికవలె' అతని సహవాసం కోసం ఉవ్విళ్ళూరుతున్నట్లు, 'సిగ్గు జడియింప' తండ్రితో తన వలపు వృత్తాంతాన్ని చెప్పలేక పోవడంచేత, ప్రియుడు నిరాశాపరుడై అడవి పట్టినట్లు వర్ణించి తన రచనలో నాయికకు ఉదాత్తస్థాన మిచ్చారు.

మూలంలో ముని తనను కౌగిలించుకున్నప్పుడు నాయిక ఆశ్చర్యంతో వెనుకకు లాగినట్లుంది (The wondering fair one turned to chide) తెలుగులో నాయిక కోప కంపితాధరంతో ముని ధర్మాన్ని నిందిస్తుంది. దీని వల్ల నాయిక శీలం అతిశయమౌతుంది.

'ఓయి మహా యతి! యిది యొప్పునయ్య
అబల నొకతె ననాథనై యడవి చిక్కి
యెక్కుమాలిన దానిని చక్కపిలిచి
నీతి మాలితి కాల్పనే నీదు వ్రతము.'

లలిత - నవ్యత :-

కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించడం సంప్రదాయం. కాని రాయప్రోలు తన 'లలిత'ను 'ఓ కుసుమాంగా' అని ప్రారంభించారు. అంతేకాకుండ 'లలిత'ను నాయికా విషాద కథనంతో ప్రారంభించి రాయప్రోలు నవ్యతను కనబరిచారు. కాల్పనిక వాద కవిత్వాన్ని తీర్చిదిద్దిన కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణం' లో అంతంలో ఉన్న విషాదం లలితలో ఆదిలోనే ప్రవేశపెట్టబడింది.

'లలిత' లో ప్రతిపాదించబడ్డ ప్రేమ సిద్ధాంతంలో తాత్త్విక ఛాయలున్నాయి. కాల్పనిక కవిత్వంలో వర్ణనల్ని అంటుకుని గంభీరమైన తాత్త్విక చింతన లోపల దారంలాగ ప్రవహిస్తూ ఉంటుంది. ఈ కాల్పనిక కవితారేఖ 'లలిత' లో తొంగి చూస్తుంది. 'రాయప్రోలు వారి విలక్షణ రససిద్ధాంతమైన అమలిన శృంగార తత్త్వము రేఖామాత్రముగా ఈ కావ్యములోనే తళుక్కు మనుచున్నది.'- అని సినారె అన్నారు.

మునివేషధారి అయిన నాయకుడు పాంథవేషధారిణి అయిన నాయికకు ఇచ్చిన ఉపన్యాసాన్ని బట్టి, రాయప్రోలు వారిదృష్టిలో ప్రేమ, వాత్సల్యం, మోహం, ప్రణయం సమానాలే అనిపిస్తాయి. తల్లి బిడ్డల వాత్సల్యం, మైత్రీ చెలుల సాధుస్నేహం, ధర్మనిష్ఠులైన దంపతుల దాంపత్యం. 'ప్రేమరహితలేక పరిపూర్తి భూతి' జీవాలై వర్ధిల్లాలని రాయప్రోలు వారి భావన. వీరు 'లలిత' లోని చివరి పద్యాల్లో చెలిమి, మోహం, దాంపత్యం, ప్రేమ, అనురాగం, ప్రణయం - అనే పదాలను ఇంచుమించుగా ఒకే అర్థంలో వాడారు. అయితే వీరి ప్రేమ సిద్ధాంతము, అమలిన శృంగార తత్త్వము 'తృణకంకణము' లోనే స్థాయి నందుకున్నదని' సినారెగారు ఆధునికాంధ్ర కవిత్వంలో (పు. 257) వివరించారు.

అయితే రాయప్రోలువారు లలితలో సంప్రదాయ పద్ధతిని వదల్లేదు. ఈ కావ్యంలోని వృత్తవిషయంలోను, పదప్రయోగంలోను రాయప్రోలు వారెక్కువ నవ్యత చూపలేదు. వీరు ప్రవేశపెట్టిన విరహవర్ణన సూర్యోదయాస్తమయ వర్ణన, తారకా వర్ణన, వనవర్ణన మొదలైన వర్ణనల్లో 'హారము భారమై ... రుచ్యపదార్థ కల్పితాహారము కారమై, .. చందనాద్యలంకారము వైరమై 'అను ధోరణి పరమ సాంప్రదాయకమైనది. ఈ వర్ణనలోని ఆంత్య నియమ మచ్చముగా పోతన్న ప్రభావమును పుణికి పుచ్చుకున్నదే. ఇక మధ్యమధ్య ప్రయుక్తములైన 'కోలను పాలతుకా', 'మానసరుకోలలు', 'గాటపున్వలపు'. 'వియోగవారిధి' 'ప్రాణము లెంత తీపో', 'ఎసఁగ కరాగ్ర దవానలము'మున్నగునవి ప్రాచీన ప్రబంధముల లోని పదబంధములనుస్ఫురింపజేయును' అని ఆధునికాంధ్ర కవిత్వంలో (పు. 255) సినారెగారు రాయప్రోలు సాంప్రదాయకతను గూర్చి చెప్పారు.

రాయప్రో 'లలిత' నవ్యకావ్యమంటూ, 'మూలమని ఒకటియున్న నదాని నతిశయించురీతిలో, స్వతంత్రవృత్తిలో నడిచినది ప్రేమగాథ ఆధునిక పరిస్థితుల కనుగుణముగా చిత్రింపబడింది ఈవిధముగా చూచినచో రాయప్రోలు వారి లలిత ప్రప్రథమ నవ్యకావ్యమనుటకు విప్రతిపత్తియుండకూడదు' - అని ఆచార్య సినారె ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయములు, ప్రయోగములు అనే సిద్ధాంత గ్రంథంలో (పు 257) చెప్పారు. సినారె 'ఈశతాబ్ది రెండోపదిలోనే సమగ్రాంధ్ర స్వరూపాన్ని సందర్శించగలిగిన 'క్రాంతదర్శి' రాయప్రోలువారు అని 'ఆంధ్రోద్యమ కవిత పాదులు - రాయప్రోలు వారి సాహిత్యదర్శనము' లో అన్నారు.

0...0

# శ్రీ కనకదుర్గానందలహరీ -
# శ్రీ శంకర భగవత్పాదకృతము

—శ్రీ చిత్రాపూరి శ్రీరామశర్మ

(గత సంచిక తరువాయి)

శా. అమ్మా! నీదగు నడ్డబాసఁగల
ముత్యంపున్ మణిన్ గూడితా
సమ్మోదంబున శోణిమాంచితభవ
ద్బాఘోష్ఠము జూడఁ బూ
ర్ణమ్మైనట్టి సుధాంబుధిన్ బ్రభవమై
తద్బిందుసంయుక్తమై
సమ్మోదప్రదమౌ ప్రవాళమును
మించ జెల్లు, దుర్గాంబికా!

౨౭

శ్లో. అయోగ్యా ఇత్యార్యైః తవదశన
సామ్యాయ కవిభిః
విముక్తా ముక్తా ఇత్యధిక విదితా మౌక్తిక
గణాః ।
దశానల్పాం గత్వా తదనుముఖ
తాంబూలసహితాః ।
గతా స్తత్సాహిత్యం ఖలు
కనకదుర్గే! భగవతి!

మ. దశనేపమ్యమునం దయోగ్యతను,
ముక్తంబై కవీశులే భవ
ద్దశనేపమ్యము బొందకున్న భువి
ముక్తా సంజ్ఞమై యొప్పుచున్
దశనల్పత్వమునొంది మెల్లమెలనా
తాంబూలమందుంచి త్వ
ద్దశనాభ్యర్ణము నొందెగాద జననీ!
తత్త్వేశి! దుర్గాంబికా!

౨౮

శ్లో. జితోహం పార్వత్యామ్యదుతతర
వాణీ విలసనైః
కథం ద్రష్టుం సంబాధర సుమతయా
బింబకదయ ।
ఇతిక్రోధాచ్ఛంచ్వాదళితవదనే
రక్తిమయుతః
శుకోయం విజ్ఞానీఖలు
కనకదుర్గే! భగవతి!

మ. గిరిజాసుందర వాగ్విలాసములచే
గెల్వంబడంగా శివా
ధర సామ్యంబును గొన్నదాన
ననుచున్ దర్పించువే బింబమా?
మరియాదాయిది యుంచుఁగిన్క
దళియింపన్ రాగరక్తాస్యమౌ
శరగీలాశుకవిజ్ఞతన్ బొగడనౌఁ
బద్మాక్షి! దుర్గాంబికా!

౨౯

శ్లో. ఫలం బింబస్యేదం భవతి
భవదీయాధరతుల
కృతాలంతస్మాద్యం వహతిమతి
రస్యేతి విదితా ।
నచేత్తస్మిన్ భుక్తే సుమతికవితానామ
పిన్నణాం
కథం స్యాత్తస్మాద్యం భువి
కనకదుర్గే! భగవతి!

మ. అరయన్ బింబఫలంబు నీయధరసా
మ్యంబందు సంచున్ గవుల్
విరచింపంగను మందబుద్ధులనుటల్
విస్పష్టమా, నిద్దియే
పరికావున్నఁ గవీశ్వరాంచితమతుల్
జాడ్యంబు పెట్టొందు నీ
శ్వరి! తద్భక్షణఁ జేసినంత భువిన్
శర్వాణి! దుర్గాంబికా!

౩౦

శ్లో. అతుల్యం తే కంఠం హారతరుణీ!
దృష్ట్వా సుకవయః
ప్రభావస్తే శంఖం పరిహాసనపాత్రం
భవతీకః!
స్వరూపధ్యాతౄణాం పథవతి
నిధిశ్శంఖఇతిచే
దసందేహం స్థానే ఖలు
కనకదుర్గే! భగవతి!
మ. సుకవుల్ నీదు గళంబు శంఖమనుటన్
జాడం గహాస్యాస్పదం
బకటా! నీదగు కంఠరూపము
నభిధ్యానింపఁగా శంఖనా
మకమౌ సన్నిధిగల్గు నిశ్చయము
సంపద్ధాత్రి! దాక్షాయణీ!
సకలామోదకరీ! త్రిలోకజననీ!
సర్వేశి! దుర్గాంబికా!

౩౧

శ్లో. అహం తం తే కంఠస్థిత కనకసూత్రం
విజయతే
హాలాహలత్స్వామూర్ధ్వా దమృతమివ
పీత్వాపిగరళమ్ ।
సమాఖ్యాం విఖ్యాతాం సముభతి
మృత్యుంజయ ఇతి
త్రయీవేద్య క్రీడావతి!
కనకదుర్గే! భగవతి!
మ. భవుఁడే మంగళసూత్రశక్తి విషమున్
భక్షించియుం గూడం దా
భువి మృత్యుంజయుఁడన్న పేరు
బడసెన్ బొల్పారఁగా నట్టిదే
భవదీయాంచిత కంఠలగ్నమగునా
బంగారుసూత్రంబు శో
భవహించున్ శ్రుతిమార్గ ఖేలనపరా!
పద్మాంఘ్రి! దుర్గాంబికా!

౩౨

శ్లో. చిరం ధ్యాత్వా ధ్యాత్వా
సకలవిబుధాభీష్టనిచయం
తత స్త్వల్లావణ్యా మృతజలధి
సంప్రాప్తజననే ।
భుజాకార్యాగ కే భువనవినుతే
కల్పకలతే
శ్రీశైలమే భూయస్తాం నమః
కనకదుర్గే! భగవతి!
మ. చిరకాలంబు సురాళి వాంఛితములన్
జింతించి చింతించి త్వ
ద్వరలావణ్య సుధాంబురాశిజనులై,
బాహాకృతిం జెంది త
త్సురభూజాత లతావిశేషములు
సంక్షోభించె లోకంబులన్
బరమశ్రీల నొసంగు మాకు నెపుడున్
బర్వాక్షి! దుర్గాంబికా!

(సశేషం).

మనుచరిత్ర పునశ్చరణం – 9

# వరూధిని మోహం - గంధర్వుడి మోసం

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

పూలు కోయడం పూర్తయింది. కానీ పూలెందుకు కోసినట్లు అని ప్రశ్నిస్తే దాని ప్రయోజనం వేరే ఏమీ కనబడదు. పూలు కోయడం ఒక విలాసక్రీడ పూలు కోస్తూ పరాచికాలాడుకోవచ్చు మానసికంగా అహ్లాదం కలిగించే క్రీడ అది కొంత కాలక్షేపం. సున్నితంగా చేయవలసిన చేతిపని అది [1] వాళ్ళు వాటిని జడల్లో తురుముకున్నారని మనం ఊహించుకోవాలి.

పుష్పాపచయం పూర్తి కాగానే దేవకన్యలంతా ఒక సరోవరం దగ్గరకు చేరుకున్నారు. ఆ సరోవరంలో హంసలున్నాయి. తామరపూలున్నాయి అపూలలోని తేనెలు తాగడానికి తుమ్మెదలున్నాయి. వాటి ఝంకారాలున్నాయి జలక్రీడలాడాలనిపించింది దేవకన్యలకు ఆ సరోవరంలో.[2]

కానీ వరూధిని మనస్సుమాత్రం వేరుగా ఉంది. జలక్రీడకామె దిగలేదు. ఆమెముఖం వాడిఉంది. అరచేతుల్లో ముఖం దాచుకుని తీరంలో కూచుంది ఏకాంతంగా ఆమె. స్నానమాడేందుకు రమ్మన్నారు చెలికత్తెలామెను కూడా. కానీ వరూధిని చేతులెత్తి వారికో నమస్కారం చేస్తూ నేను రాలేను మీరంతా కానీయండి అంది దిక్కుల్లో దేన్నో వెదుక్కుంటూ [3]

అప్పటికే మధ్యాహ్నమైపోయింది. సూర్యకాంతిలో త్రసరేణువులు(atoms) ఎగురుతున్నాయి. సుడిగాలి రేగుతోంది. అందులో తుమ్మెదలు వరసలు కట్టి ఆడుతున్నాయి. అక్కడ కాలువలనిండా కలువలున్నాయి. అదో అందమైన దృశ్యం. ఆ కాలువగట్టున ఎన్నోతీగలూ వాటినిండా పువ్వులూ వాటినుంచి ఎగురుతున్న పుప్పొడులూను వాటిని చూస్తోంది వరూధిని.[4]

పొదలమీది పువ్వులను కోసుకోవడానికి వరూధిని చేయి చాపింది ఆ చేతి

తున్న బంగారు కంకణం మెరిసిపోతోంది. కానీ, పూలు ఆమెకందడంలేదు. పెదవులు వణుకుతున్నాయి ఆమెకు. వీణ మోగుతున్నట్లు ఆమె పేదాన్ని పునః పునశ్చరణం చేస్తోంది. నాలుగు దిక్కుల్నీ వెదుకుతున్నాయి ఆమె కళ్ళు. ఎందుకో? తెలియదుకానీ దిక్కుల్లో ఆమె చూపులు తోరణాలు కడుతున్నట్లు అవుతున్నాయి. ఆమె బంగారురంగుతో మెరిసిపోతోంది. ఆ రంగు ఆ తోటనిండా వ్యాపిస్తోంది. ఆమెది పెద్దజడ. నితంబందాకా వేలాడుతూ పాములా కనిపిస్తూనే తుమ్మెదలకు సైతం నల్లదనాన్ని వడ్డీకిస్తూఉన్నట్లుగా ఉంది ఇంతలో ఆమెకొక బ్రాహ్మణుడు కనిపించాడు. అడుగో దేవపూజ కోసం కాబోలు అతడూ పూలు కోసుకుంటున్నాడు.[5]

ఆ బ్రాహ్మణుడు అచ్చంగా ప్రవరుడిలాగే కనిపించాడు వరూధినికి. కలలో కనిపించిన అద్భుతపురుషుడు వాస్తవ ప్రపంచంలో కనిపించినంత ఆశ్చర్యం కలిగిందామెకు పూర్వం తాను చూసిన ప్రవరుడు కలలోనివాడు ఇప్పుడితడు ఎదురుగా ఉన్నవాడు అనిపించిందామెకు. అతనికెదురుగావెళ్ళి మబ్బులోని మెరుపులాగా కనిపిస్తూ అతడ్ని ఆకర్షించడానికి ప్రయత్నించసాగింది [6]

అతనివైపు ఆమె చూపిన చూపులో ఆనందం ఉంది. ఎర్రనికాంతి ఉంది. అది ఎలాగుందో పెద్దనగారు చెబితే వినాల్సిందే. అదొక మనోహర భయంకరమయిన ఉత్ప్రేక్ష.[7]

వరూధిని చొరవతీసుకుంది మళ్ళీ. ఆమె కోరిక బలవత్తరం (intolerable) గా ఉండటమే అందుకు కారణం ఆ సాహసంలో ఆమె మనసూ శరీరమూ ఏకమయిపోయాయి. అందువల్ల ఆమెకు భావవికారాలతోపాటు శారీరకవికారాలు కూడా ఎన్నో కలిగాయి వాటిని పెద్దన అత్యంత సహజంగా వర్ణించాడొక పీసంలో. గుండెజల్లుమనడం, తొట్రుపాటు కలగడం, ముఖం వాడిపోవడం, కనుఱెప్పలు కదలడం, గొంతుబొంగురుపోవడం, చెమటలు పట్టడం, కన్నీరు రావడం వంటివన్నీ ఇక్కడ ప్రసక్తమయ్యాయి [8]

వరూధినికి ఏడుపొచ్చింది. ఆమె కాటుక కన్నీరు చెక్కిళ్ళమీద జారుతోంది. ఆ చెక్కిళ్లు ఎలాగున్నాయో పెద్దనగారు చెబితే వినాల్సిందే. ఏనుగుదంతాన్ని పగులగొడితే ఎలాంటి కాంతి వస్తుందో అలాంటి కాంతి ఆమె చెక్కిళ్ళమీద ఉందట.[9]

వరూధిని తానే అతన్ని ఈమాటు ముందు పలకరించిందని పెద్దనగారి చిత్రణ. ఆ ఎత్తుగడ పద్యం చాలా అందమయింది. ముచ్చటలు గొలిపే సంభాషణలతో నిండిఉన్నదది అక్కడి మామిడితోటల్లో జాజిపూల పందిళ్ళలో వెన్నెలలో తన సమాభవించవలసిందని వరూధిని అతనికి సూచిస్తుంది తాను మన్మథుని బందీ నయినానని చెబుతుంది.[10]

ప్రవరుడికి వైరాగ్యం ఎక్కువనీ ఆచారనిష్ఠ ఉందనీ వరూధినికి తెలుసు కానీ అతడు తన నంగీకరించి తీరాలి. లేకపోతే, తన బ్రతుకు వ్యర్థమనీ ఆమె భావిస్తుంది. మరణానికైనా సిద్ధమే తాను.[11]

ప్రవరుడి మనస్సు ఆమె దృష్టికి శిలాసదృశంగా కనిపిస్తుంది. "నీ మనస్సు రాయి చేసుకుని కాబోలు కరగకుండా ఉన్నావు" అంటూ దెప్పుతుంది. 'ఇంతకీ ఇదే నా అదృష్టం' అనుకుంటుంది. తన అదృష్టం నిజానికి దురదృష్టమే [12]

మాయాప్రవరుడు ఈ మాటలకు ఎలా ప్రతిస్పందిస్తాడో మనం చూడాల్సిఉంది ఆ ప్రతిస్పందనమబట్టి పెద్దన పాత్రలనెలా తీర్చిదిద్దుతాడో గమనించవచ్చు. మాయాప్రవరుడి మాయ నటనగురించి పెద్దన ఒక సీసపద్యం రాశాడు.[13]

నిజానికి ఆ గంధర్వుడుశృంగారంలో అంతకుముందే చాలా అనుభవాలు గలవాడు. వరూధినికలాంటి అనుభవంలేదు. మాయాప్రవరుడు తన అనుభవాలుబొక్కకుండా జాగ్రత్తగా వ్యవహరిస్తాడు.తన కోరిక నెరవేరబోతోందని ఎంతో సంతోషంగా ఉందతనికి. కానీ ఆసంతోషాన్ని అతను దాచేసుకుంటాడు. రసావేశాన్ని నియంత్రించుకుంటాడు ఉస్సురని మౌనంగా ఉండిపోతూ నేలమీద బొటనవ్రేలితో రాస్తూ నటిస్తాడు. చివరికి పీలగొంతుకతో జవాబిస్తాడు.

"నేను కనిపించకపోవడంవల్ల నా తల్లిదండ్రులు మనస్తాపం పొందుతారు. ఇల్లాలు కృశిస్తుంది. ఇల్లు శూన్యమయిపోతుంది" ఇవన్నీ అబద్ధాలే. చివరికి తనకు అనుభవించాలని ఉన్నా, తన మనస్సు ఆమెమీద లగ్నమయి ఉండే పరిస్థితులు లేవు– అంటాడు.[14] కానీ ఈ మాటలమీద నిలవడు.

దేవేంద్రుడికికూడా లభించని సుఖం తనకు లభించనున్నందుకు సంతోషంగా ఉందంటాడు అంతలోనే గంధర్వుడు. తానేమీ 'సన్యాసి'కానంటాడు. కాకపోతే తనకు వచ్చిన కష్టంలో ఆ సుఖం చేదుగా ఉందంటాడు బెట్టుసరిగా [15]

ఆమె దైన్యం చూస్తుంటే తనకు బాధగా ఉందన్నాడు. అందుకే తన నియమాలను వదిలేస్తున్నానన్నాడు. మనసులో లేని మాటలనుకూడా నాలుకమీదికి తెచ్చుకునేవారికి ప్రతినిధి ఈ గంధర్వుడు.[16]

గంధర్వుడికి తెలుసు తనగుట్టు బైట పడితే, ఎప్పుడైనా ప్రమాదమే (Danger) అని. అందుకోసం దాన్ని తప్పించుకునే ఉపాయం (Trick) పన్నుకున్నాడు. సంయోగసమయంలో కళ్ళుమూసుకోవడం తమ దేశంలో ఆచారం అనడం ఆ మాయోపాయమే. తప్పును తప్పుతోనే కప్పుకోవడం గంధర్వుడి నీతి [17]

ఈ పద్ధతి (Formality) నంగీకరిస్తే తనకేమీ అభ్యంతరం లేదన్నాడు గంధర్వుడు. తానా పద్ధతికి వ్యతిరేకంగా వర్తిస్తే చచ్చినంత పని జరుగుతుందన్నాడు. తాను విరక్తుడు కావలసివస్తుందని సూచించాడు [18]

మాయాప్రవరుడి మాటల్లోని మోసాన్ని వరూధిని ఎంతమాత్రమూ పసిగట్టలేకపోవడానికి కారణం ఆమె వ్యామోహమే. "వ్రతం చెడినా ఫలం దక్కాలి కదా! కోరిక తీరేదాకా నిన్ను తృప్తిపరిచి నేను నిష్క్రమించేదాకా నన్ను విడిచి పెట్టి వెళ్ళకూడదు" అంటాడు గంధర్వుడు.[19]

తనకటా! రెండే మార్గాలున్నాయటా! మొదటిదేమో ఆమె పరిష్వంగమట! రెండేదేమో తపస్సట! ఈ రెండూ కాకపోతే ఇహపరాలు రెండూ చెడిపోతాయట! గంధర్వుడి మాయమాట లిలాగున్నాయి.[20]

వరూధిని ఆమోదించింది. ఉబ్బి తబ్బిబ్బు అయింది. తన ధన్యత్వాన్ని ప్రకటించింది.[21]

వరూధిని వర్తనం చెలికత్తెల కాళ్ళ ర్యాన్ని విభ్రమాన్నికూడా కలిగించింది [22] కొందరామెను వేళాకోళం చేస్తారు. వరూధినీగంధర్వులు ఉద్యానం లోపలికి ఏకాంతంకోసం వెళ్ళిపోయారు. ఆ ఉద్యానం ఒక కాల్పనిక లోకం (Dream world).[23] ఆ ఉద్యానం లో ఉంది వరూధిని మణిమయభవనం. ఆ భవనంలో ఒక పొదరిల్లు. వెన్నెల తీగలూ ఏలకి తీగలూ బంటిగురివెంద తీగలూ అల్లుకున్న ఆ లతాగృహంలో ఒక కలువల పరుపు (హల్లకతల్పం) మీద వారి సంయోగం.[24]

గంధర్వుడు వరూధినీ సంయోగ సుఖాన్నెలా అనుభవించాడో ప్రబంధ ఫణితిలోనే పెద్దన వర్ణించారు మనమైతే ఈ సంప్రదాయాన్ని కావ్యాల్లో ఈనాడు ఆమోదించడంలేదు. నిజమాలోచిస్తే స్త్రీ పురుష జీవసంయోగాన్ని ప్రకృతి ఎన్నడూ నిషేధించలేదు. అది శాస్త్రరీత్యా జీవపునరుత్పత్తి (reproduction) కి అత్యవసర సంవిధానం. ఆ లక్ష్యాన్ని నిరాదరించినప్పుడు అది అశ్లీలమే అవుతుంది. ఈ అశ్లీలాన్ని భాషాపరమైన సభ్యతతో కప్పిపుచ్చి పెద్దన అద్భుతం చేశాడు. అశ్లీలమే అయినా వదులుకోలేని పద్యంగా దీన్నితీర్చిదిద్దాడు. బహువ్రీహి సమాసాల చాటుమాటున ఈ శృంగారమంతా నిక్షిప్తమయిపోయింది. అర్థం చెప్పుకోదలిస్తే అంతా అశ్లీలమే. ఎవరికి వారు చదువుకుంటే అశ్లీలం కాదు. పాఠ్యంగా చెప్పడానికి వీలుకాని పద్యం ఈ సీసం.[25]

తరువాత వరూధిని గర్భధారణ. ఆ సమయంలో స్త్రీలక్షణాలూ అన్నీ ప్రబంధ సంప్రదాయం ప్రకారం జరిగినవే.[29] కానీ వరూధిని రతికేళీలాలన కొంత అనాగరికంగా కనిపిస్తుంది. అయితే ఈ వర్ణన పెద్దన చేసింది కాదనీ ఎవరో మరోకవి రాసి, చేర్చిఉంటాడనీ కొందరు భావిస్తారు [27]

గంధర్వుడింక తనపని పూర్తి అయిందని నిష్క్రమించదలుస్తాడు. "నా వంచన తెలిస్తే ఆమె నన్ను శపిస్తుంది" అని అతని భయం. పారిపోతే, ఆమె ఆత్మహత్యకు పాల్పడుతుందని అతని శంక. అందుకోసం అతడొక అబద్ధమాడ వలసివస్తుంది తనకు పాదలేపమిచ్చిన యోగి హిమగిరిమీద మళ్ళీ కనిపించాడనీ తన ఊరి విశేషాలు చెప్పాడనీ తన సంసారం, తన వ్యవస్థ చెడిపోతున్నదనీ గోలపెడతాడు వరూధినిముందు.

తన తల్లిదండ్రులు ముసలితనంతోనూ మృత్యువుతోనూ పోరాడుతున్నారు కనుక తాను వాళ్ళను చూడటానికి వెళ్ళవస్తానంటాడు.

ఈ అబద్ధాల గొలుసుమ రక్తి కట్టించడంలో పెద్దన వైచిత్రి చూపిస్తాడు. "బాగా వేడెక్కిన ఇనుపగుండుమీద ఎన్ని నీళ్లు పోసినా ఇంకిపోతాయి. నీ వల్ల నా కోరికలింకా పెరిగిపోతున్నాయి" అంటాడు జాలికలిగేలాగ [28]

మోసగాడెన్ని చక్కని నీతుల్ని చెప్పగలడో చూడాలంటే గంధర్వుడి మాటల్ని చూడవచ్చు [29]

గంధర్వుడి మాటలకు వరూధిని జవాబేం చెప్పగలదు? ఆమె నిస్సహాయంగా ఏడ్చింది. ఆ ఏడుపును పెద్దన గొప్ప భావచిత్రంలో చూపించాడు.[30]

గంధర్వుడామె దుఃఖోద్వేగాన్ని గమనించి ఇంకా నటించసాగాడు. ఆ నటనలో భాగంగానే ఆమె నోదార్చసాగాడు.[31] ఆమెకు ధైర్యంనూరిపోశాడు [32] ఆకాశగమన విద్య తనకు మునీశ్వరుడి ద్వారా తెలిసిపోయిందనీ తాను వస్తూ పోతూనే ఉంటావనీ చివరి అబద్ధం చెప్పి తప్పించుకుపోయాడు గంధర్వుడు చల్లగా.

## అధ్యయన సూచికలు

1. పుష్పాపచయం మన ప్రబంధాల్లో ఒక సంప్రదాయం. ఆ సందర్భంలో దేశిచ్ఛందస్సు వాడటంకూడా ఒకనియమం.

2. 'వాలీక మధూన్మత్త మరాళీ ముఖరాళీ సుఖరంబగు కొలవన్ కేళీలాలసగతి డిగి యాళీనివహంబు లోలలాడిరి కేళన్' ఆనేకం దంలో చూపించాడు పెద్దన 'ళి' నినాలుగుసార్లు త్రిప్పడం ద్వారా ఒకసొగసుని, చిత్రంగా లేదూ?

3. 'వాడిన మోముదమ్మి ... సెన్నొసల్ కరమునందిడి వీరవిషణ్ణయై' అనే పద్యం 86 చూడండి.

4. చిత్రంగా ఉంది పెద్దనగారిక్కడ చతురస్రగతిలో సాగే మాలినీ వృత్తం (ననమయయ 15 వ ఛందస్సు 9 యతి) వాడటం.

5. "పనిడితోరము తోడి బాహువల్లన సత్తి సారెకు పాదలపై చాపి చాపి' అని మొదలయ్యే ఈ సీసపద్యం వరూథిని చకచ్చకిక రూపాన్ని చిత్రకారుడు కూడా చిత్రించలేని రీతిలో చూపిస్తుంది. పెద్దన మంచిపద్యాలేవీ చూపమంటే నేను దీన్ని తప్పకుండా పేర్కొంటాను. ద్వితీయాశ్వాసంలోని 27వపద్యం "తతనితంబాభోగ ధవళాంశుకములోని" అనే సీసంకూడా వరూథినిలాగే చిత్రించి ఉంది.

6. కాంచి కలక్వణత్కనక కాంచికయై యెదురేగి యప్పుడు తన్ని కుంజాంచల వీధి తారుచు ఘనాంత చలచ్చపలా కృతిన్ కలన్ గాంచిన వస్తువును తెలిసి కాంచినయట్లు- ఇదీ ఆమె అనుభూతి, ద్వితీయాశ్వాసంలో అసలు ప్రవరుడ్ని చూసినప్పుడు పెద్దన చేసిన వర్ణనకీఇక్కడి వర్ణనకీ తారతమ్యం ఆసక్తిదాయకంగా ఉంటుంది పాఠకులకు. అక్కడ 'ఝళంఝళత్కటక సూచిత వేగపదారవింద' అయితే ఇక్కడ 'కలక్వణత్కనక కాంచిక' అవుతుంది వరూథిని ఇందులో మర్మం ఆలోచించదగింది. ఇదివరకు ప్రవరుడ్ని చూసినపుడు వరూథిని చూపిన సంభ్రమానికీ ఇప్పుడితడ్ని చూసినపుడు చూపుతున్న సంభ్రమానికీ గల తేడా కూడా పాఠకుల నాకట్టుకుంటుంది.

7. "తమ్మరస మంటుకొనన్ విడవింటివాడు క్రొవ్వైక ధురీణతన్' కరచి యేసిన కింగిణికోల' ఆమె చూపు. 90వ పద్యం.

8. 'తొలుదొల్త వానిఁగన్నులఁ గాంచినప్పుడ పల్లవాధర గుండె జల్లుమనియె— సొలసి మాటాడ నుంకింప దలచి మోము తేరకొని చూమనపుడ కన్నీరువోడమె' 91 వ పద్యం అలంకారశాస్త్ర రసదృష్టితో ఇవన్నీ అనుభావసాత్త్విక వ్యభిచారి భావాలు.

9. 'పాటీరకరిదంతద్యుతి పాటచ్చర గండఫలక భాగంబులు' అని 92 వ పద్యం-కందంలో వర్ణన.

10. "ఏలర యీ చలంబుడిగి యేలర బాలరసాల మాలతీ జాలములో శశాంక కరజాలములో వలవంత వ్రతువుల్ జాలుగ నాల్గుజాలు నిక జాలు భవంబనువంత శాకవన్ బాలయి రాత్రి పంచశరు బారికి చిక్కితి నీవు దక్కితిన్' ఈ ఉత్పల మాలలో పెద్దన చిత్రకవితా స్ఫూర్తిని ప్రయోగించాడు. ఊరికేనా? కాదు;వరూధిని వాక్ చిత్రతను చూపడానికే. మనుచరిత్రలో మరపురాని పద్యాల్లోఇదొకటి.

11. చావో యెక్కడు నీ యెడన్ బొడము వాంఛన్ భూసురగ్రామణీ!

12. 'అదృష్ట" మన్ మాటను వ్యతిరేకార్థంలో వాడటం గమనించదగింది.

13. "కానసాగి కామినీగోష్ఠి ప్రౌఢమూలైన యెుదుటు బాపుల రెప్పతుదల నాచి-శిరసాకింత యెత్తి సన్నంపు వెలుగుతో నిట్టులనియె'-97 వ పద్యం.

14. 'తల్లిందండ్రియు నన్ను గానని మనస్తాపంబునం బొక్కగా, నిల్లాలార్తి కృశింపగా' ఇవన్నీ అబద్ధాలే. - 98 వ పద్యం.

15. 'నేను పన్యాసినే? యెుక్కచో తపాతపాన్ మనసొగ్గదు కేళిపై ననాశ్వాసిత దుఃఖిత్ మునిసి సర్వముసహ్యమనా సెయంగ వే?'-99 వ పద్యం.

16, "భవద్దీనత కై వ్రతము విడిచితిన్- వరులకు మేలైనన్ చాలు శరీరంబైన

నుపేక్షింపదలయు'నంటాడు గంధర్వుడు. 100 పద్యం.

17. తనయు నెడన్ దలయు తన్ను గనయును మాటున్ - ఇది అస్మద్దేశవ్యవహారము-కన్నతెరవ నఘుతుగు -

18. ఈ మర్యాదకు నీవొడంబడిన మేలు - 102 వ పద్యం.

19. వ్రతముచెడ శాఖ్యమైనను వలయు గలుగు - 103వ పద్యం.

20. 'ఇహపరంబుల కూరక దూరమై పయిః శ్రీ చన రెంటికిన్ జెడిన రేవడ నాదునా" - 105 వ పద్యం.

ద్వితీయాశ్వాసంలోని ప్రవరవరూధినీ సమాగమఘట్టాన్ని ఇక్కడ స్మరిస్తే ఎంత విచిత్ర మనిపిస్తుంది. కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్ అని అక్కడ కవి సమర్థించాడు. ఇక్కడ గంధర్వుడి మాయలే వరూధిని చిత్తాన్ని కలంచడం గమనించదగింది.

21. 'నా నోముల్ ఫలియించె నా పయసు ధన్యంబయ్యె' 108.

22, ద్వితీయాశ్వాసంలోని 44 వ పద్యంలో వరూధిని చెలికత్తెల పేర్లుకొన్ని వినవస్తాయి. ఘృతాచి, తిలోత్తమ, హరిణి, హేమ, రంభ. శశిరేఖ. ఈ ఆశ్వాసంలో మరికొన్ని పేర్లు వినవస్తాయి. మంజుఘోష, ఊర్వశి, చంద్రరేఖ (శశిరేఖ) మేనక, పుంజికస్థల. ఈ అప్సరో బృందంలో ఉంది వరూధిని. 109 వ పద్యం.

23. పెద్దనగారి సీసపద్యాల హొయలకు ఈ వర్ణన మరోమచ్చుతునక, 111 సీసం. మృగనాభినికరంపు బుగబుగల్ గలచోట - శారికలనంగ శాస్త్రముల్ చదువుచోట-

24. చూ. 112, 113, 114 పద్యాలు.

25. సహసా నఖంపచ స్తనదత్త పరిరంభ మామూలపరిచుంబితాధరోష్ఠము - ఆస్తిమిత భూషణారవ మావధూటి ప్రథమసురతంబు గంధర్వపతిగరంచె- 116 పద్యం.

26. 118-121 పద్యాలు.

27. 'మనసు కక్కురితి మెల్లన లేచి చేతుల కాంతుని జబ్బగా కౌగలించు' అనే సీసం. మన ప్రబంధాలలోని ఇలాంటిపద్యాలను తొలగించుకోవడంలో తప్పులేదు.

28. 125-135 పద్యాలు.

29. ఎవ్వడు మీ రెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిన్ జరింపగా నవ్వల వంశహాని వ్రతహాని యశోధహాని పుట్టుగదా నవ్వెడగు - అమ్మనువ్యపకువు - అయ్యవివేకి చెడున్ జగంబునన్ నవ్వగ పాలు కౌర వమానం బడపాలును నిందపాలునై, 185 పద్యం.

30. లోచన గోళంబుల చిమ్మురె జాలై తరంగంబులై చనుదోయిన్ గొనబౌ తరంగమదచర్యల్ జారిపో నొక్కయెడ్డున బాష్పంబు ఝరంబు లుప్పతిల పోటుం బాటుగా-136వ పద్యం.

31. మొగమెత్తి అశ్రులు మెత్తన కొనగోర బార మీటుచు పలికెన్ అని పెద్దనగారి వర్ణన 137 వ పద్యం.

32. 'ధీరస్వాంతవు! వంత నీవు తగునే దివ్యాంగనల్ కోవిదల్ గారె? యోగ వియోగముల్ సతములే కర్తవ్యముల్ సేయరే? పోరే రారె ప్రియంబు గల్గిన జనుల్ పోరామి పోబోవుచే? పోరాకుండగ నేమి కాఫు తెగనే ఫుల్లాంబుజాతేక్షణా!' 138 వ పద్యం.

(ఇంకా ఉంది)

* * *

మిరియాల రామకృష్ణ
25-6-5/3, జయకృష్ణపురం,
రాజమండ్రి-5.

...—...

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

— శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

హిందూసమాజం బ్రాహ్మణాధిక్యత కలది అనడంలో సందేహం ఏ మాత్రం లేదు. తొలినాళ్ళనుండి హిందూసంస్కృతికి సంప్రదాయానికి బ్రాహ్మణులే నాయకత్వం వహించారు. 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః' అన్న న్యాయం ప్రకారం బ్రాహ్మణుడు నడచిన దారినే తక్కిన సమాజం అనుగమించింది. అందుకే ఆనాటి నుండి ఈనాటి నాయకరుల వరకు ప్రతివాడూ తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలో-ప్రచారం చేయడంలో బ్రాహ్మణ నిందను-బ్రాహ్మణ ద్వేషాన్ని మెట్లుగా చేసుకున్నారు. ఎఱ్ఱయగారి నాటితురకలుకూడా బ్రాహ్మణులనే ఎక్కువగా హింసించినట్లు మాహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలే సాక్ష్యమిస్తున్నాయి. ఇక్కడ ఒకరహస్యముంది. ఏనుగులు మందలు మందలుగా తిరుగుతుంటాయి. ప్రతిమం

దానికి అగ్రేసరమైన ఏనుగు ఉంటుంది. ఏనుగులను వేటాడదలచిన వాడు మొదట ఆ అగ్రేసరమైన ఏనుగును వేటాడుతాడు. అది దెబ్బతింటే ఆ మంద విచ్చి చెల్లాచెదరవుతుంది. అప్పుడు వాటిని తేలికగా బంధించవచ్చు.

హిందువులకు అగ్రేసరుడు బ్రాహ్మణుడు. అతడిని నిరసింప చేస్తే అతడు ధర్మభ్రష్టుడౌతే సమాజమే నిరసిస్తుంది. భ్రష్టమౌతుంది. ఈ తత్త్వం తెలిసినవారు తురకలు. అందుకే వారు వారిలాంటి వారు తమదాడులకు బ్రాహ్మణుడిని కేంద్రం చేసుకున్నారు. అందుకే తాను చూచిన బ్రాహ్మణుల పాట్లనే ఎఱ్ఱయ గారు తన కావ్యంలో అభివర్ణించారు.

పై పద్యంలో 'ఆ ప్రదేశము దారయై యసురవరులు' – 'కొంతతడవు విచ్చలవిడిం ద్రుళ్ళిరి' అన్న వాక్యాలను జాగ్రత్తగా గమనించాలి. కాకతి ప్రతాపరుద్రుడు బందీ అయిన తర్వాత తురకలు ఆంధ్రదేశంలో అడ్డూ అదుపు లేకుండా విచ్చలవిడిగా - ఇష్టారాజ్యంగా ప్రవర్తించారు. ఈ కాలం చాలా కొద్దిపాటిదే! క్రీ. శ, 1323 నుండి క్రీ. శ. 1330 వరకు సుమారు 6 లేక 7 సంవత్సరాలు వారి అధిపత్యం ఆంధ్రదేశం మీద కొనసాగింది. ఆ తరువాత హిందూ రాజ్యాల స్థాపన - ధర్మపరిరక్షణ జరిగాయి. చరిత్ర చెప్పిన ఈ సత్యాన్ని నెమరు వేసుకుంటే ఎఱ్ఱయగారి కవితలోని సామాజిక స్పృహ-వాస్తవికత తెలిసివస్తాయి,

వేనుడి తర్వాత పృథుచక్రవర్తి రాజ్యానికి వచ్చాడు. అతడు రాగానే ముందట చేసింది దేశాన్ని ఏకాతపత్రం క్రిందికి తేవడం రెండవది తన తండ్రి వేనుడి అకృత్యాలను సరిదిద్దడం. ఈ విషయాని ఎఱ్ఱయగారు ఇలా చెప్పారు.

ప్రస్తుత సమాచారం :-

## నిరంతరం సి. నారాయణరెడ్డి

—శ్రీ వంటినేని రవీందర్

తెలుగు సాహిత్య కీర్తిప్రతిష్ఠలను ప్రపంచవ్యాప్తంగా ఇనుమడింపజేస్తూ, జ్ఞానపీఠ పురస్కారాన్ని పొందిన మహాకవి సి. నారాయణరెడ్డి. వీరు కరీంనగర్ జిల్లాలోని వేములవాడ (మండలం)నందు గల హనుమాజీపేట అను కుగ్రామంలో "ప్రజోత్పత్తి" సం॥లో సింగిరెడ్డి మల్లారెడ్డి, బుచ్చమ్మ దంపతులకు జన్మించిన సి. నా. రె. శ్రీనాథునిలాగా చిరుప్రాయంలోనే కవిత్వం అల్లడం మొదలెట్టాడు. నునుమీసాల నూత్నయౌవనంలోనే "నవ్వని పువ్వు" గేయకావ్యాన్ని ఆవి

ఏకాతపత్రముగ సిరి
గైకొని నృపమౌళిరత్న కలికా కలితా
లోకంబు చరణ పేర
శ్రీ కన్నతి సేయ బృథుడు
చెన్ను వహించెన్!

తన జనకుండు ధర్మగతి దప్పుట
నొప్పరితొల్లి యొల్లబో
యిన జనకోటి దాను గడు నెక్కొనుగా
నొనరించు సాదరం
బున సమరంజనోత్సవము బొందగ
రాజను పేరికొక్కడున్
జెనుపగు పాత్రమయ్యె గుణశీలు డాతడు
నీతిధన్యతన్!

—హరి. ఆ. 1-ప. 118-199.

తన జనకుడు చేసిన దౌర్జన్యాలవల్ల 'యొల్లబోయిన జనకోటి'ని తన దానాల చేత, ధర్మబుద్ధి చేత, ఆదరంచేత ఆకట్టుకొని 'అను రంజనోత్సవము బొందగ రాజను పేరికొక్కడు'గా వర్తించాడట పృథువు చేసిన పనులు కావు రాజ్యానికి రాగానే వేమభూపాలుడు చేసినది. తురకల ధమకిడి ఇల్లూ-వాకిలీ వదలి అడవులు పట్టిపోయిన ప్రజలకు అభయప్రదానం చేసి తిరిగి రప్పించి జనపదాలు కళకళలాడేట్లు చేసింది వేమభూపాలుడు. ఇందువల్ల ఎఱ్ఱయగారు పృథువుకు వాడిన విశేషణాలన్నీ వేమునికి సరిగ్గా సరిపోతాయి. 'రాజను పేరి - గుణశీలుడు - నీతిధన్యుడు' ఎఱ్ఱయగారి వేముడే!

కామ్యక వనంలో సైంధవుడు వావి వరుసలు మరచిపోయి ద్రౌపదిని చెఱబట్టాడు. పాండవులు అతడ్ని అడ్డగించి శిక్షించారు. అవమానించారు. ఈ ఘట్టాన్ని వర్ణిస్తూ ఎఱ్ఱయగారు రెండు కందపద్యాలు వ్రాశారు. ఆ రెండూ భీముడి కోపాన్ని. కసిని ప్రదర్శించేవి.

ఒడిసి తలపట్టి, నేలం
బడదిగిచిన, వాడు పెనగబడుటయు,
డిక్కన్
మెడ ద్రొక్కి గాఢముష్టిం
బొడిచె మొగంబవియ రక్తపూరము
దొరగన్!

బడలెల్ల బిండి కూడగ
బొడిచి, యొగయ నెత్తి త్రిప్పి
భూస్థలిమీదన్
బడవైచి యురమున మొగమును
నడిచెను వడముడి తలప్రహారవశలుండై!

— అరణ్యపర్వం-ఆ.6-ప.247-48

( సశేషం )

స్కరించిన ప్రతిభాశాలి, నిరంతరకవితా విరామం లేకుండా సాహిత్యంలోని పలు ప్రక్రియలలో రచనలు చేస్తున్న విశ్వకవి.

1950 నుండి 60వ జన్మదినోత్సవం (27-7-91) వరకు 40 ఏళ్ళనుండి 46 సంపుటాలు ప్రకటించిన కవి. సి.నా.రె. జన్మదినంరోజు 40 కవితలతో కూడిన 'నిరంతరం' అను కవితా (సంపుటిని) మయూరి కళాసమితి, రాజమండ్రి, చింతల గోపాలరావు, ముద్రణకు ఉపక్రమించినపుడు కవితలు సేకరణలో డా॥ ఎన్. గోపి, డా॥ జయధీర్ సహకరించినారు. పుస్తకం అందంగా తీర్చిదిద్ది జన్మదిన కానుకగా సమర్పించడం ముదావహం.

డా॥ సి. నారాయణరెడ్డి పేరులోనే కాదు, అతని మూర్తిమత్వం ఆదర్శనీయమైనది. కవితా మహోన్నతశిఖరాలను అధిరోహించిన మహాకవి, వీరు ఏపదవిలో ఉన్నా ఆ పదవికే కీర్తి. అధికారభాషా సంఘం అధ్యక్షులుగా, సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా, ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా సి.నా.రె. నిర్వహించారు, నిర్వహిస్తున్నారు. ఏ పదవిలోవున్నా వజ్రంలా ప్రకాశించే వ్యక్తిత్వం సి.నా.రె.ది.

గేయకావ్యాలు, గేయనాటికలు, కవితాసంపుటిలు, అనేక సినీగేయాలు వ్రాసిన ఈ కవి పలుసాహిత్య ప్రక్రియలలో అందెవేసిన చేయి. "ఆధునికాంధ్ర సాంప్రదాయము - ప్రయోగము" అను సిద్ధాంతగ్రంథం అమూల్యమైనది. ఉత్తమ విమర్శకులు అనడానికి ఈ గ్రంథం తార్కాణం. తెలుగు సాహిత్యంలో నారాయణరెడ్డి డైనమిక్ హీరో. సాటిలేని మేటికవి. పల్లెపట్టున జన్మించి ఏటి ఒడ్డున నడకనేర్చిన నారాయణరెడ్డి కవితా విశ్వాంతరాలను సృష్టిస్తున్న కవి, మన సాహిత్యంలో ఆణిముత్యం.

ఆవేదనాతరంగాలనుండే కవిత్వం ఉద్భవిస్తుందంటారు. వాల్మీకి శోకం శ్లోకం అయినట్లు, నారాయణరెడ్డి బాధ కవిత్వంగా ఉద్భవిస్తుంది. నేటి సంఘాన్ని లోకాన్ని ఈ లోకంలోని పోకడలను చూసిన ఈ కవి వేదనాభరితుడౌతున్నాడు. శాస్త్ర సాంకేతిక రంగాలలో అభివృద్ధి చెందుతున్నాం. ప్రపంచం మారుతోంది. సాంకేతిక పరిజ్ఞానంతో మనిషి సృష్టికి ప్రతిసృష్టి చేయగలుగుతున్నాడు. కాని అభివృద్దితోపాటు మనిషి తన పతనాన్నికూడా సృష్టించుకున్నట్లుంది. అణుబాంబులు, ఆటంబాంబులు ఇవన్నీ లోకాన్ని భస్మీపటలం చేయగల సామర్థ్యం కల్గినవి. కనుక...

శాస్త్రజ్ఞులారా
పరమాణువులు రగిలి
చరిత్రను పొగచూరనీయకండి...

అని సి.నా.రె. తనబాధను వ్యక్తపరుస్తూ లోకంలోని ఈ 'అణువును' హితానికై వాడండి. ఈర్ష్య, ద్వేషాలతో మనిషిని మనిషి, దేశాలకు దేశాలు, పతనమైపోతే ఎట్లా.... అందుకే ప్రపంచ సౌభాగ్యానికై మన మేథస్సును ఉపయోగించాలని హితవు చెప్తున్న నారాయణరెడ్డి-

రేపటి హృదయం నాలో
లోపల గుసగుసలాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని...

ఔను మనిషిలో మార్పు కనిపిస్తుంది. గతంకన్నా నేడు మెరుగుందని, మనిషీ నీవు నీలోని అనైక్యతను తొలగించి, నేను అనేదాన్ని వదిలి మనం అనేది హృదయంలో నాటుకొమ్మని మానవుడు మారుతున్నాడు. రాజకీయాలలో అవినీతి పరులను గుర్తిస్తున్నాడు. 'కాంతిని రక్షించుటకై సంగ్రామం జరుగబోదు. ఇక నీకు దోకాలేదు. నీలోని శక్తుల్ని ప్రక్షాళనం చేసుకొంటున్నావు. మనిషి నీ భవిష్యత్తు మహోజ్వలంగా ఉంటుందని ఆకాంక్షిస్తున్నాను.

సృజనాత్మకశక్తి లేని
భజనకీర్తనలు చెల్లవు
కళాపరిమళము లేని
గడ్డిపద్యాలు నిల్వవు... (అంటున్న)

ఈ కవి లోకంలో భజనపరులకు, వంది మాగధులకు స్థానం లేదని, ప్రతిభకు గుర్తింపు ఉంటుందని చెప్తున్నాడు ఈ కవి.

భరతజాతిని కాటువేసిన
పాము విలవిల దన్నుకొన్నది
విప్లవాధ్వరమంత్రవిభులు
వీర్యమై మీరగున లొత్తిగా...

తరతరాలనుండి భారతదేశం పరాయి ప్రభువుల చేతులలో నలిగిపోయినది. దాస్యవిడనాడంకొరకు ఎందరో యోధులు పోరాడినారు. బ్రిటిష్‌వార్కన్నా పూర్వంనుండీ ఈ జాతి దాస్యభారాన్ని మోస్తున్నది. మహమ్మదీయరాజుల దురాక్రమణలో కొన్ని వందల సంవత్సరాలు బందీయై ఉండినది.

ఇలాంటి తరుణంలో...

ఝాన్సీలా ఒక అపరచండిక
సకులు విదలిచి హ్రాంకరించగ .

ఈ భారతీయ తిరుగుబాటులో ఝాన్సీలాంటి అపరచండికలు, తాంతియాలాంటి వీరయోధులు శివాజీలాంటి మొక్కవోని ధైర్యస్థులు, రాణాప్రతాపలాంటి కొదమ సింహాలు మన జాతి ఆత్మగౌరవానికి ప్రతీకలై నిల్చారు.

మహమ్మదీయుల తర్వాత మనదేశాన్ని ఆక్రమించిన కంపెనీలలో ఫ్రెంచివారు, డచ్చివారు, బ్రిటిష్‌వారు, వీళ్ళు మన సంపదను లూటీ చేశారు. వీరిని ఎదుర్కో

కడానికి గాంధీ, నెహ్రూ లాంటివారు శాంతిపద్ధతిలో అల్లూరి భగత్‌సింగ్, చంద్రశేఖరఆజాద్ లాంటి క్రాంతికారుల ఉగ్రవాదంతో సుభాష్‌చంద్రబోస్ లాంటివారు అతివాదంతో పెనుగి బ్రిటిష్‌వాళ్ళ గుండెల్లో రైళ్లు పరుగెట్టించి మనకు స్వాతంత్ర్యం లభింపజేశారు

ఏండ్లతరబడి గాయిదైన మడి
ఎండిపోయిన ఋషుల దేశము
విటలనేత్రము విప్పి సరిగా
చేటికొక్క శతాబ్దియైనది

ఈ స్వాతంత్ర్యఫలాన్ని పొందిన మానవుడు ప్రజారాజ్యం పేరిట రాజ్యంస్థాపించి నేడు నల్లవాణ్ణి నల్లవాడు దోపిడిచేసే క్రూరత్వాన్ని చూసిన నారాయణరెడ్డి నొచ్చుకుంటున్నాడు. ఆవేదనలో కవిత్వం రాస్తున్నాడు.

సమాజహృదయంలో దాక్కొని
డమరుధ్వని వింటున్నాను.
. ...........ఈ సమాజాన్ని తను

చూస్తున్నానని అవినీతిమయమైన ఈ లోకంగూర్చి బాధగా ఉందని. మధ్యతరగతివాని జీవితం చాలా దయనీయంగా ఉందని

పెరిగిపోతున్న ధరల్ని చూసి
పెదవి విరవడం మానుకున్నాను
కడివెడన్ని కలల్ని తాగేసి
కడుపు నింపడం నేర్చుకున్నాను ..

బ్లాక్‌మార్కెట్ విధానం, స్వార్థపరులైన వ్యాపారస్తుల కబంధహస్తాలలో మధ్యతరగతివాడి జీవితం నలిగిపోతుంది.

వంచననుంచి మంచిని వేరుచేసే
అంచముక్కును వెదుకుతున్నాను ..

ఈ సమాజంలో మార్పు రావడానికి ప్రయత్నిస్తున్నానని దానికై మార్గాన్ని అన్వేషిస్తున్నానని నారాయణరెడ్డి కవిత్వంలో మనిషిలోని చెడును పారద్రోలు తానని అంటున్నారు. నారాయణరెడ్డి దృష్టి పూలమ్మే సాయిబుల కుర్రవాడిపై పడింది. పేదరికం ఎంత చెడ్డది. మనిషిని దిగజారుస్తుంది ఈ ఆకలి మనిషిని నంజుకు తింటుందని

ఆవ్యాప్తుని చింపిరిబ్రతుకులోంచి
ఆకలి అందంగా మెరుస్తున్నాది...

కాని ఆ కుర్రవాడు, తన ఆకలిబాధను దిగమింగుకుంటూ ''సన్నజాజి పూలమాలా'' అంటూ వెళ్తుంటే, ఎందరో

ఎన్ని విచీలకబరీభరాలు ఎదురు
చూస్తున్నాయో
ఎన్ని విలోలదృగంచలాలు ఎగసి
పడుతున్నాయో
ఆ సన్నజాజిపూలమాలకోసం
ఆ సౌరభాల తరంగాలకోసం

ఆ పూలమాలలు ధరించి అందంగా, ఆనందంగా వుండేవాళ్ళకి ఈ పేదవాడి గూర్చి ఏం తెలుసు.

సాయంసంధ్య మరింత నల్లబడింది
సాయిబుల కుర్రాడిగొంతు చల్లబడింది

అలసిపోయి, దీనంగా ఇంటికి చేరుకున్న ఆ కుర్రవాడు తల్లి శవమై ఉండడం చూసి కెవ్వుమన్నాడు.

సన్నజాజీ పూలమాలా
మిన్నుల్లో ప్రతిధ్వనించింది ఆర్తగీతం
తల్లీ కొడుకుల శవాలపైన
అల్లా కురిపించాడు అశ్రుజలపాతం ..

ఈ శోకమయిగాథను చిత్రించిన సి. నా. రె.ను పీడితజనపక్షంలో నిల్చి శాంతియుతంగా ఈ వ్యవస్థకు నిరసన తెల్పుతున్న కవిగా మనం గుర్తించాలి. అతడు సమాజంలోని అట్టడుగువారి జీవితాలు మారాలి అని వాపోతున్న కవి.

పీడితుని వేడినిట్టూర్పులో
పావురాయి మూలుగూవుంది...

అంటున్న నారాయణరెడ్డి బ్రతుకుగూర్చి చెప్తూ, నిరాశలోనైనా మనిషి ప్రాణంలేని బండరాయిలా మారవద్దు.

బ్రతుకంటే నిప్పులు తొక్కడమూ కాదు
కన్నీళ్లు కనుగుడ్లలో కుక్కడమూ కాదు...

అని బ్రతుకుగూర్చి చెప్తూ, ధైర్యంతో సమస్యలను ఛేదించాలి. ఛాలెంజిగా బ్రతకాలి అన్న ఈ కవి

బ్రతుకంటే వర్షామేఘం
బీళ్ళతో ఏళ్ళతో దాని అనుబంధం...

ఈ వ్యవస్థలో ఎందరో దగాపడ్డ తమ్ముళ్ళున్నారు. చెల్లాయిలున్నారు వల్లంతా ఈ కుటిలనీతి పోకడలోని సమాజాన్ని మార్పు చేయడానికి, దోపిడీస్వార్థపరుల ఆటలు కట్టించడానికి...

మనుషులమీద నమ్మకం పోయినవాడు
మట్టినీ సుట్టునూ పట్టుక ఏంచేస్తాడు ?

భరించరాని వ్యవస్థలో బ్రతుకేకంటే దౌర్జన్యపూరితమైన ఈ స్వార్థపరుల ఆటలు కట్టించడానికి, దోపిడిలేని వ్యవస్థను సృష్టించడానికి గుట్టల్లోకి వెళ్ళిన తమ్ముణ్ణి తల్చుకుంటూ దమ్మునుమాత్రం మెచ్చుకుంటున్నానని ఈ కవి దారి తప్పిన తమ్ముడు కాదని! అతడు సమాజ స్వరూపాన్ని మార్చి నవసమాజం నిర్మించే వీరుడని అలాంటి వీరులు పుట్టడం దేశానికి శ్రేయస్కరమని... అన్యాయాన్ని, దోపిడీని ఈ కవి సహించడు, ఉదయాన్ని హృదయంగా తలంచిన నారాయణరెడ్డిని మహాకవి అనక మానేమంటాం...

ఉదయం నా హృదయం
తూర్పు నా ఊపు
మార్పు నా తీర్పు ..

ఈ ప్రసారాలద్వారా ఉదయించిన సూర్యుడు చైతన్యానికి ప్రతీక, అలాంటి ఉదయమే తన హృదయమని చాటుకొన్న కవి. ఈ సమాజంలో మార్పు కోరుకుంటున్నట్లుగా భావించాలి. పరపీడన లేని సమాజం రావాలి. లోకంలో అంద

(తరువాయి 19వ పేజీలో)

స్కరించిన ప్రతిభాశాలి, నిరంతరకవిగా విరామం లేకుండా సాహిత్యంలోని పలు ప్రక్రియలలో రచనలు చేస్తున్న విశ్వకవి.

1950 నుండి 60వ జన్మదినోత్సవం (27-7-91) వరకు 40 ఏళ్ళనుండి 46 సంపుటాలు ప్రకటించిన కవి. సి నా.రె. జన్మదినంరోజు 40 కవితలతో కూడిన 'నిరంతరం' అను కవితా (సంపుటిని) మయూరి కళాసమితి, రాజమండ్రి, చింతల గోపాలరావు, ముద్రణకు ఉపక్రమించినపుడు కవితలు సేకరణలో డా॥ ఎస్. గోపి, డా॥ జయధీర్ సహకరించినారు. పుస్తకం అందంగా తీర్చిదిద్ది జన్మదిన కానుకగా సమర్పించడం ముదావహం.

డా॥ సి. నారాయణరెడ్డి పేరులోనే కాదు, అతని మూర్తిమత్వం ఆదర్శనీయమైనది. కవిగా మహోన్నతశిఖరాలను అధిరోహించిన మహాకవి, వీరు ఏపదవిలో ఉన్నా ఆ పదవికే కీర్తి. అధికారభాషా సంఘం అధ్యక్షులుగా, సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్ గా, ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా సి నా.రె. నిర్వహించారు, నిర్వహిస్తున్నారు. ఏ పదవిలోవున్నా వజ్రంలా ప్రకాశించే వ్యక్తిత్వం సి.నా.రె. ది.

గేయకావ్యాలు, గేయనాటికలు, కవితాసంపుటిలు, అనేక సినీగేయాలు వ్రాసిన ఈ కవి పలుసాహిత్య ప్రక్రియలలో అందెవేసిన చేయి. "ఆధునికాంధ్ర సాంప్రదాయము - ప్రయోగము" అను సిద్ధాంతగ్రంథం అమూల్యమైనది. ఉత్తమ విమర్శకులు అనడానికి ఈ గ్రంథం తార్కాణం. తెలుగు సాహిత్యంలో నారాయణరెడ్డి డైనమిక్ హీరో. సాటిలేని మేటికవి. పల్లెపట్టున జన్మించి ఏటి ఒడ్డున నడక నేర్చిన నారాయణరెడ్డి కవిగా విశ్వాంతరాలను సృష్టిస్తున్న కవి, మన సాహిత్యంలో ఆణిముత్యం.

ఆవేదనాతరంగాలనుండే కవిత్వం ఉద్భవిస్తుందంటారు. వాల్మీకి శోకం శ్లోకం అయినట్లు, నారాయణరెడ్డి బాధ కవిత్వంగా ఉద్భవిస్తుంది. నేటి సంఘాన్ని లోకాన్ని ఈ లోకంలోని పోకడలను చూసిన ఈ కవి వేదనాభరితుడౌతున్నాడు. శాస్త్ర సాంకేతిక రంగాలలో అభివృద్ధి చెందుతున్నాం. ప్రపంచం మారుతోంది. సాంకేతిక పరిజ్ఞానంతో మనిషి సృష్టికి ప్రతిసృష్టి చేయగలుగుతున్నాడు. కాని అభివృద్ధితోపాటు మనిషి తన పతనాన్నికూడా సృష్టించుకున్నట్లుంది. అణుబాంబులు, ఆటంబాంబులు ఇవన్నీ లోకాన్ని భస్మీపటలం చేయగల సామర్థ్యం కల్గినవి. కనుక...

శాస్త్రజ్ఞులారా
పరమాణువులు రగిలి
చరిత్రను పొగచూరనీయకండి ..

అని సి.నా.రె. తనబాధను వ్యక్తపరుస్తూ లోకంలోని ఈ 'అణువును' హితానికై వాడండి. ఈర్ష్య, ద్వేషాలతో మనిషిని మనిషి, దేశాలను దేశాలు, పతనమైపోతే ఎట్లా.... అందుకే ప్రపంచ సౌభాగ్యానికై మన మేధస్సును ఉపయోగించాలని హితవు చెప్తున్న నారాయణరెడ్డి-

కపటి హృదయం నాలో
లోపల గుసగుసలాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని...

ఔను మనిషిలో మార్పు కనిపిస్తుంది. గతంకన్నా నేడు మెరుగుందని, మనిషీ నీవు నీలోని అనైక్యతను తొలగించి, నేను అనేదాన్ని వదిలి మనం అనేది హృదయంలో నాటుకొమ్మని మానవుడు మారుతున్నాడు. రాజకీయాలలో అవినీతి పరులను గుర్తిస్తున్నాడు. 'కాంతిని రక్షించుటకై' సంగ్రామం జరుగబోదు. ఇక నీకు ఢోకాలేదు. నీలోని జబ్బును ప్రక్షాళనం చేసుకొంటున్నావు. మనిషి నీ భవిష్యత్తు మహోజ్వలంగా ఉంటుందని ఆశిస్తున్నాను.

సృజనాత్మకశక్తి లేని
భజనకీర్తనలు చెల్లవు
కళాపరిమళమే లేని
గడ్డిపద్యాలు నిల్వవు... (అంటున్న)

ఈ కవి లోకంలో భజనపరులకు, వందిమాగధులకు స్థానం లేదని, ప్రతిభకు గుర్తింపు ఉంటుందని చెప్తున్నాడు ఈ కవి.

భరతజాతిని కాటువేసిన
పాము విలవిల దన్నుకొన్నది
విప్లవాధ్వరమంత్రవిదులు
వీర్యమై మీరుచున తొల్తగా...

తరతరాలనుండి భారతదేశం పరాయి ప్రభువుల చేతులలో నలిగిపోయినది. దాస్యవిడనాడంకొరకు ఎందరో యోధులు పోరాడినారు. బ్రిటిష్ వాళ్ళకన్నా పూర్వంనుండీ ఈ జాతి దాస్యభారాన్ని మోస్తున్నది. మహమ్మదీయరాజుల దురాక్రమణలో కొన్ని వందల సంవత్సరాలు బందీయై ఉండినది.

ఇలాంటి తరుణంలో...

ఝాన్సీలా ఒక అపరచండిక
కత్తులు విదలిచి హుంకరించగ .

ఈ భారతీయ తిరుగుబాటులో ఝాన్సీలాంటి అపరచండికలు, తాంతియాలాంటి వీరయోధులు శివాజీలాంటి మొక్కవోని ధైర్యస్థులు, రాణాప్రతాపలాంటి కొదమ సింహులు మన జాతి ఆత్మగౌరవానికి ప్రతీకలై నిల్చారు.

మహమ్మదీయుల తర్వాత మనదేశాన్ని ఆక్రమించిన కంపెనీలలో ఫ్రెంచివారు, డచ్చివారు, బ్రిటిషులు, వీళ్ళు మన సంపదను లూటీ చేశారు. వీరిని ఎదుర్కో

రడానికి గాంధీ, నెహ్రూ లాంటివారు శాంతిపద్ధతిలో అల్లూరి భగత్ సింగ్, చంద్రశేఖరఆజాద్ లాంటి క్రాంతికారుల ఉగ్రవాదంతో సుభాస్ చంద్రబోస్ లాంటివారు అతివాదంలో చెలరేగి బ్రిటిష్‌వాళ్ళ గుండెల్లో రైళ్లు పరుగెట్టించి మనకు స్వాతంత్ర్యం లభింపజేశారు

ఏండ్లతరబడి గాయిగాయై మండి
రయించిపోయిన ఋషులదేశము
నిటలనేత్రము విప్పి, సరిగా
నేటికొక్క కళాత్మగొనగ

ఈ స్వాతంత్ర్యఫలాన్ని పొందిన మానవుడు ప్రజారాజ్యం పేరిట రాజ్యం స్థాపించి నేడు నల్లవాణ్ణి నల్లవాడు దోపిడిచేసే క్రూరత్వాన్ని చూసిన నారాయణ రెడ్డి నొచ్చుకుంటున్నాడు. ఆవేదనలో కవిత్వం రాస్తున్నాడు.

సమాజహృదయంలో దాక్కొని
డమరుధ్వని వింటున్నాను.

....... ....ఈ సమాజాన్ని తను చూస్తున్నానని అవినీతిమయమైన ఈ లోకంగూర్చి బాధగా ఉందని. మధ్యతరగతివాని జీవితం చాలా దయనీయంగా ఉందని

పెరిగిపోతున్న ధరల్ని చూసి
పెదవి విరవడం మానుకున్నాను
కడివెడన్ని కలల్ని తాగేసి
కడుపు నింపడం నేర్చుకున్నాను ..

బ్లాక్ మార్కెట్ విధానం, స్వార్థపరులైన వ్యాపారస్తుల కబంధహస్తాలలో మధ్యతరగతివాడి జీవితం నలిగిపోతుంది.

వంచనలుంచి మంచిని వేరుచేసే
అంచముక్కును వెతుకుతున్నాను ..

ఈ సమాజంలో మార్పు రావడానికి ప్రయత్నిస్తున్నానని దానికై మార్గాన్ని అన్వేషిస్తున్నానని నారాయణరెడ్డి కవిత్వంలో మనిషిలోని చెడును పారద్రోలు తానని అంటున్నారు. నారాయణరెడ్డి దృష్టి పూలమ్మే సాయిబుల కుర్రవాడిపై పడింది. పేదరికం ఎంత చెడ్డది. మనిషిని దిగజారుస్తుంది ఈ ఆకలి మనిషిని నంజుకు తింటుందని

అన్నార్తుని చింపిరిబ్రతుకులోంచి
ఆకలి అందంగా మెరుస్తున్నాది...

కాని ఆ కుర్రవాడు, తన ఆకలిబాధను దిగమింగుకుంటూ "సన్నజాజి పూలమాలా" అంటూ వెళుతుంటే, ఎందరో

ఎన్ని వినీలకబరీభరాలు ఎదురు
చూస్తున్నాయో
ఎన్ని విలోలదృగంచలాలు ఎగిసి
పడుతున్నాయో
ఆ సన్నజాజిపూల మాలకోసం
ఆ సౌరభాల తరంగాలకోసం

ఆ పూలమాలలు ధరించి అందంగా, ఆనందంగా వుండేవాళ్ళకి ఈ పేదవాడి గూర్చి ఏం తెలుసు.

సాయంసంధ్య మరింత నల్లబడింది
సాయిబుల కుర్రాడిగొంతు చల్లబడింది

అలసిపోయి, దీనంగా ఇంటికి చేరుకున్న ఆ కుర్రవాడు తల్లి శవమైఉండడం చూసి కెవ్వుమన్నాడు.

సన్నజాజీ పూలమాలా
మిన్నుల్లో ప్రతిధ్వనించింది ఆర్తగీతం
తల్లీ కొడుకుల శవాలపైన
అల్లా కురిపించాడు అశ్రుజలపాతం ..

ఈ బాధామయగాథను చిత్రించిన సి.నా.రె.ను పీడితజనపక్షంలో నిల్చి కాంతియుతంగా ఈ వ్యవస్థను నిరసన తెల్పుతున్న కవిగా మనం గుర్తించాలి. అతడు సమాజంలోని అట్టడుగువారి జీవితాలు మారాలి అని వాపోతున్న కవి.

పీడితుని వేడినిట్టూర్పులో
పావురాయి మూలుగూవుంది...

అంటున్న నారాయణరెడ్డి బ్రతుకుగూర్చి చెప్తూ, నిరాశలలోనై మనిషి ప్రాణం లేని బండరాయిలా మారవద్దు,

బ్రతుకంటే నిప్పులు కక్కడమూ కాదు
కన్నీళ్లు కనుగుడ్లలో కుక్కడమూ కాదు...

అని బ్రతుకుగూర్చి చెప్తూ, ధైర్యంతో సమస్యలను విభేదించాలి. ఛాలెంజిగా బ్రతకాలి అన్న ఈ కవి

బ్రతుకంటే వర్షామేఘం
బీళ్ళతో ఏళ్ళతో దాని అనుబంధం...

ఈ వ్యవస్థలో ఎందరో దగాపడ్డ తమ్ముళ్ళున్నారు. చెల్లాయిలున్నారు వల్లంతా ఈ కుటిలనీతి పోకడలోని సమాజాన్ని మార్పు చేయడానికి, దోపిడీస్వార్థపరుల ఆటలు కట్టించడానికి ..

మనుషులమీద నమ్మకం పోయినవాడు
మట్టినీ గుట్టనూ పట్టుక ఏంచేస్తాడు ?

భరించరాని వ్యవస్థలో బ్రతుకేకంటే దౌర్జన్యపూరితమైన ఈ స్వార్థపరుల ఆటలు కట్టించడానికి, దోపిడిలేని వ్యవస్థను సృష్టించడానికి గుట్టల్లోకి వెళ్ళిన తమ్ముణ్ణి తల్చుకుంటూ దమ్మునుమాత్రం మెచ్చుకుంటున్నానని ఈ కవి దారి తప్పిన తమ్ముడు కాదని! అతడు సమాజ స్వరూపాన్ని మార్చి నవసమాజం నిర్మించే వీరుడని అలాంటి వీరులు పుట్టడం దేశానికి శ్రేయస్కరమని... అన్యాయాన్ని, దోపిడీని ఈ కవి సహించడు, ఉదయాన్ని హృదయంగా తలంచిన నారాయణరెడ్డిని మహాకవి అనక మరేమంటాం .

ఉదయం నా హృదయం
తూర్పు నా ఊర్పు
మార్పు నా తీర్పు ..

ఈ ప్రసారాలద్వారా ఉదయించిన సూర్యుడు చైతన్యానికి ప్రతీక, అలాంటి ఉదయమే తన హృదయమని చాటుకొన్న కవి. ఈ సమాజంలో మార్పు కోరుకుంటున్నట్లుగా భావించాలి. పరపీడన లేని సమాజం రావాలి. లోకంలో అంద

(తరువాయి 19వ పేజీలో)

# పోతన ప్రహ్లాద చరిత్ర - ఒక సమీక్ష

—డా॥ వందూరి వేంకటసత్యరామారావు

(గత సంచిక తరువాయి)

ఆంధ్రీకరణము :-

అనువాద రచనమును మూలరచనముతో పోల్చి, అది యథామాత్రకమై నను కోల్పోయినను తులనాత్మక పరిశీలనము కావించుట ఉచితము. మూలమునకు యథాతథానువాదమైనచో ఆ కవి తదనుసరణమున నెంతవఱకు కృతకృత్యుడైనది, అమూలకముగా నూతన కల్పనలు కావించినచో అనువాదకుని స్వాతంత్ర్య మేపరిధిలోనున్నదియు, అట్టి నూతన కల్పనల ఔచిత్యమును పరిశీలింపవలయును.

మూలభాగవతమునందలి సర్వార్థములను ఆంధ్రుల కందించుటయే పోతనలక్ష్యము. మూలభావమును, అర్థగాంభీర్యమును తన అనువాదములో నుండవలయునని తలచినవాడు పోతన. సంస్కృత భాగవతము పరమప్రౌఢమైన పురాణము. ఇది గంభీర విషయవిచారణమును, గూఢార్థపద గుంఫితమునై యున్నది. ఈ గ్రంథమును మోక్షశాస్త్రమనియు, సాత్వత సంహిత యనియు వ్యవహరించుట కలదు. ఇట్టి భాగవతమును అవగాహన మొనర్చుకొని అన్వయ మొనర్చుకొనుట మహాపండితులకు మాత్రమే సాధ్యము. మూలభాగవతమునకు వ్యాఖ్యానము కావించిన శ్రీధర యతీంద్రుడు -

'అహంచ వాచ్మి చ్ఛయా సంతః
శుకమంతాం మనుసాహుశుక్
మయాపి స్వీయభోదాయకృత మే
తన్న గర్వతః'

అని పలికియున్నాడు ఇక పోతన్న కూడ మూల గ్రంథగత సర్వార్థములు అవగాహన మగునాయని సందేహించినాడు. అవగాహన మొనర్చుకొనుటయే కష్టమైన యెడల అందలి తత్త్వవివేచనమును అనువదించుట మిక్కిలి కష్టము. తత్త్వవిషయ వివరణమున పోతన మిక్కిలి శ్రద్ధను చూపినాడు. పద్యములలో చెప్పిన అర్థవ్యక్తి చెబ్బతినునని తత్త్వవిషయములను చెక్కువగా వచనములలో చెప్పినాడు. కావుననే -

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన, దమ్మిచూలికైన
విబుధవరుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు'

అని చెప్పినాడు. తాను పెద్దల వలన వినినదానిని, శ్రీధర వ్యాఖ్యానము నాధారముగాగొని గ్రహించినదానిని మనన మొనర్చుకొని భావనచేసి గ్రహించినంత తెలియపర్చెదనని పోతన పలికినాడు. ఈ లక్ష్యముతోడనే పోతన తన అనువాద ప్రణాళికను సిద్ధ మొనర్చుకొనినాడు. కావుననే తెలుగుభాగవతము మూలముకంటె పెరిగినది.

సద్గుణగరిష్ఠుడైన ప్రహ్లాదుడు బాలు దేవునియందు సహజ సంసిద్ధ మానసిరంతర ధ్యానరతుడై యున్నప్పటి స్థితిని సంస్కృత భాగవతకర్త -

'క్వచిద్రుదతి వైకుంఠ చిన్తాశబలచేతసః
క్వచిద్ధసతి తచ్చిన్తాహ్లాద ఉద్గాయతి క్వచిత్॥
నదతి క్వచిదుత్కంఠో విలజ్జో
నృత్యతి క్వచిత్
క్వచిత్తద్భావనాయుక్తస్తన్మయోఽనుచకార హ॥
క్వచిదుత్పులకస్తూష్ణీమాస్తే సంస్పర్శ
నిర్వృతః
అస్పన్ద ప్రణయానన్ద సలిలామీలితేక్షణః'
(7స్కం-4అ-39-41)

అని చెప్పియుండెను. కాని మూలమున ప్రహ్లాదుడు నవ్వుట, నృత్యము చేయుట

11. శ్రీమదాంధ్ర భాగవత అనుశీలనము పుట 92

(18వ పేజీ తరువాయి)

రూ సుఖంగా ఉండాలి. సంపద ఎవరి చేతుల్లో బందీ కావద్దు... అన్న కవి ఇలాంటి సమాజం మారాలన్నదే తన తీర్పుగా ప్రకటిస్తున్నారు.

స్వాసధారణ గుర్పు బిగించే
మోసం కళ్లు తెంచుకుని
నిటారుగా నడిచొచ్చా నిక్కడికి
నీతి బట్టకట్టి బతుకుతున్న చోటికి

పైపై నటనలతో సమాజాన్ని మోసం చేస్తున్న వారినుండి, అవకాశవాదంతో ప్రజలను మోస్తూ మేము చేస్తున్నదంతా మంచేనని చెప్పి వంచన చేస్తున్న వంచన గాళ్ళనుండి... ఛేదించుకుని

కంచెలా తలెత్తుక నిలుస్తాను
మైదానమంత ఊపిరితో...

అంటున్న ఈ కవి స్వేచ్ఛను కోరుకుంటున్నాడు. అది సంపూర్ణ స్వేచ్ఛగా ఉండాలన్నదే వీరి తపన.

• • •

ఎస్. రవీందర్
రూమ్ నెం. 40
న్యూ రీసెర్చ్ స్కూల్ హాస్టల్
ఉస్మానియా క్యాంపెక్స్
హైదరాబాద్-7.

(•••)

కుందరైన వానికి కారణము పేర్కొనలేదు. పోతన మూలమును గ్రహించుచునే ప్రహ్లాదుని చేష్టలకు కారణమును కూడ చెప్పెను. మూలభాగవతమునందలి పై గ్రంథములు పోతనచేతిలో -

"వైకుంఠ చింతావివర్జితచేష్టుడై యొక్కడు
నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుడింతియకాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను విధానము గంటినేనని
యుబ్బి గంతులువైచు నొక్కచోట
బలుకు నొక్కచోటం బరమేశుం గేశవుం
బ్రణయహర్ష జనితబాష్పసలిల
మిళితపులకుండై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు"
(7 స్కం-ప 124)

అని రూపమునందినవి. పోతన రచనలో భక్తియొక్క అంకురావస్థనుండి ఫలావస్థవరకు వర్ణింపబడినవి. మూలమునందు క్రమపద్ధతిలో లేనివానిని, పోతన క్రమబద్ధము గావించి ప్రహ్లాదుని భక్తిని యొక సీసపద్యములో వర్ణించెను.

ప్రహ్లాదుని శీలమును వర్ణించు సందర్భమున సంస్కృత భాగవతమున-

బ్రహ్మణ్యః శీలసంపన్నః సత్యసన్ధో
జితేన్ద్రియః।
ఆత్మవత్సర్వ భూతానామేకప్రియ
సుహృత్తమః॥
దాసవత్సన్నతార్యాఙ్ఘ్రిః పితృవద్దీనవత్సలః
భ్రాతృవత్సదృశేస్నిగ్ధో గురుష్వీశ్వర
భావనః
విద్యార్థరూపజన్మాఢ్యో మాన స్తమ్భ
వివర్జితః' (7 స్క-4అ-31,3 శ్లో)

అని చెప్పబడినది. దీనిని పోతన -

తనయందు నఖిల భూతములయందు
నొక భంగి
సమహితత్వంబున జరుగువాడు
పెద్దలం బొడగన్న భృత్యునికైవడిం
జేరి నమస్కృతుల్ చేయువాడు
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృభావముచేసి మరలువాడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనులం గావం జింతించువాడు
సఖులయెడ సోదరస్థితి జరుపువాడు
దైవతము లంచు గురువులం దలంచువాడు
లీల లందును బొంకులు లేనివాడు
లలితమర్యాదుండైన ప్రహ్లాదుండధిప.'
(7స్క, ప 115)

అని అనువదించెను. ఆత్మవత్సర్వభూతానాం అనునది 'తనయందు నఖిల ..' అని, దాసవత్సన్నతార్యాఙ్ఘ్రి అనునది 'పెద్దలం బొడగన్న భృత్యునికైవడి..' అని, అనువదింపబడినది. ఇట్లు పోతన మూలశ్లోకములకు మెరుగుపెట్టి ఆంధ్రీకరించెను.

చండామార్కుల దగ్గర విద్యాభ్యాసము పూర్తిచేసికొని వచ్చిన కుమారుని విద్యానైపుణ్యమును పరీక్షింపగోరిన హిరణ్యకశిపుడు 'భవదీయోత్కృష్టంబగు పద్యం?' యని ప్రశ్నించెను. దానికి ప్రహ్లాదుడు చెప్పిన సమాధానము మూలమునందు-

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం
పాదసేవనమ్।
అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మ
నివేదనమ్॥
ఇతిపుంసార్పితా విష్ణౌభక్తిశ్చేన్నవ
లక్షణా।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽ
ధీతముత్తమమ్'
(7స్కం-5అ-శ్లో 23,24)

అని చెప్పబడిన భావమునే ఎట్టిమార్పులు లేకుండగ పోతనచేతిలో ఒకే ఒక పద్యమైనది.[12]

ప్రహ్లాదుడు సహాధ్యాయులగు రాక్షస బాలకులకు ఆధ్యాత్మిక విషయములను బోధించుచు విద్వాంసుడు కూడ కామదోష దూషితుడగునని చెప్పిన సందర్భమున మూలములో -

'యతో న కశ్చిత్ క్వచ కుత్రచిద్వా
దీనః స్వమాత్మానమలం సమర్థః।
విమోచితుం కామదృశాం విహార
క్రీడామృగో యన్నిగళో విసర్గః'
(7స్క-6అ శ్ర 17 అని చెప్ప

బడెను. ఈ భావమును పోతన-

'హాలాపాన విజృంభమాణ మదగర్వా
రూఢ దేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయ
సంబద్ధాత్ముండై లేకమున్
లీలానిస్సరణంబు గానక మహావిద్వాంసు
డున్ గామినీ
హేలాకృష్టకురంగ కాబకముగన్
హీనస్థితిన్ వింటిరే' (7స్కం-ప215)

అని చెప్పెను.

మూలమున

'న్యస్తక్రీడనకో బాలో జడవత్తన్మనస్తయా
కృష్ణగ్రహ గ్రహీతాత్మా న వేద
జగదీదృశమ్. (7స్కం అ4-శ్లో87)

అని చెప్పబడినభావమును పోతన ప్రహ్లాదుని భక్తి తన్మయత్వమునకనువుగ విస్తరించి ఒక సీసపద్యమును వ్రాసెను.[13]

హిరణ్యకశిపుడు తనకుమారుడగు ప్రహ్లాదుని చండామర్కులయొద్దకు విద్యాసముపార్జనకు పంపెను. చండామర్కులు మిగిలినరాక్షసబాలకులతో కలిపి ప్రహ్లాదుని చదివించినట్లు మూలమున కలదు. ఈవిషయమూలమున-

---

12. శ్రీమహాభాగవతము - 7 స్కంధము - పద్యము 167

18. ,, ,, -పద్య 122

# పోతన ప్రహ్లాద చరిత్ర - ఒక సమీక్ష

—డా॥ మండూరి వేంకటసత్యరామారావు

(గత సంచిక తరువాయి)

ఆంధ్రీకరణము :-

అనువాద రచనము మూలరచనముతో పోల్చి, అది యథామాతృకమైనను కకపోయినను తులనాత్మక పరిశీలనము కావించుట సుచితము. మూలమునకు యథాతథానువాదమైనచో ఆ కవి తదనుసరణమున నెంతవఱకు కృతకృత్యుడైనది, అమూలకముగా నూతన కల్పనలు కావించినచో అనువాదకుని స్వాతంత్ర్య మేపరిధిలోనున్నదియు, అట్టి నూతన కల్పనల ఔచిత్యమును పరిశీలింపవలయును.

మూలభాగవతమునందలి పర్యార్థములను ఆంధ్రుల కందించుటయే పోతనలక్ష్యము. మూలభావమును, అర్థగాంభీర్యమును తన అనువాదములో నుండవలయునని తలచినవాడు పోతన. సంస్కృత భాగవతము పరమప్రౌఢమైన పురాణము. ఇది గంభీర విషయవిచారణమును, గూఢార్థపద గుంఫితమునై యున్నది. ఈ గ్రంథమును మోక్షశాస్త్రమనియు, సాత్వత సంహితయనియు వ్యవహరించుట కలదు. ఇట్టి భాగవతమును అవగాహన మొనర్చుకొని అన్వయ మొనర్చుకొనుట మహాపండితులకు మాత్రమే సాధ్యము. మూలభాగవతమునకు వ్యాఖ్యానము కావించిన శ్రీధర యతీంద్రుడు -

'అహంవేద్మి శుకోవేత్తి
వ్యాసోవేత్తి నవేత్తివా
భక్త్యా భాగవతం గ్రాహ్యం
న బుద్ధ్యా న చ టీకయా'

'ఈతుం తామిచ్ఛా సంతః
క్షమంతాం మమసాహసమ్
మయాయం స్వీయ భోదాయకృత మే
తన్న గర్వతః'

అని పలికియున్నాడు ఇక పోతన్న కూడ మూలగ్రంథగత పర్యార్థములు అవగాహన మగునాయని సందేహించినాడు. అవగాహన మొనర్చుకొనుటయొక ప్తమైన యొడల అందలి తత్త్వవివేచనమును అనుసరించుట మిక్కిలి కష్టము. తత్త్వవిషయ వివరణమున పోతన మిక్కిలి శ్రద్ధను చూపినాడు. పద్యములలో చెప్పిన అర్థ వ్యక్తి చాలదేమోనని తత్త్వవిషయములు పెక్కు వచన గాంచనములలో చెప్పినాడు. కావుననే -

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మిచూలికైన
విబుధవరుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు'

అని చెప్పినాడు. తాను పెద్దల వలన వినినదానిని, శ్రీధర వ్యాఖ్యానము ఆధారముగాగొని గ్రహించినదానిని మనన మొనర్చుకొని భావనచేసి గ్రహించినంత తెలియపర్చెదనని పోతన పలికినాడు. ఈ లక్ష్యముతోడనే పోతన తన అనువాద ప్రణాళికను సిద్ధమొనర్చుకొనినాడు. కావుననే తెలుగుభాగవతము మూలముకంటె పెరిగినది.

సుగుణాకరిష్ఠుడైన ప్రహ్లాదుడు తాను దేవునియందు సహజ సంసిద్ధ మానసిరంతర ధ్యానపరుడై యున్నప్పటి స్థితిని సంస్కృత భాగవత కర్త -

'క్వచిద్రుదతి వైకుంఠ చిన్తాశబలచేతనః
క్వచిద్ధసతి తచ్చిన్తాహ్లాద ఉద్గాయతి క్వచిత్॥
నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్
క్వచిత్తద్భావనాయుక్తస్తన్మయోఽనుచకారహ॥
క్వచిదుత్పులకస్తూష్ణీమాస్తే సంస్పర్శనిర్వృతః
అస్పన్దప్రణయానన్ద సలిలామీలితేక్షణః'
(7స్కం-4అ-39-41)

అని చెప్పియుండెను. కాని మూలమున ప్రహ్లాదుడు నవ్వుట, నృత్యము చేయుట

11. శ్రీమదాంధ్ర భాగవత తానుశీలనము పుట 92

(18వ పేజీ తరువాయి)

రూ సుఖంగా ఉండాలి. సంపద ఎవరి చేతుల్లో బందీ కావద్దు... అన్న కవి ఇలాంటి సమాజం మారాలన్నదే తన తీవ్రంగా ప్రకటిస్తున్నారు.

వ్యాసధారణ గుర్ర బిగించే
మోసం కట్లు తెంచుకుని
నిటారుగా వడిచొచ్చా నిక్కడికి
నీతి బట్టకట్టి బతుకుతున్న చోటికి

పైపై నటనలతో సమాజాన్ని మోసం చేస్తున్న వారినుండి, అవకాశవాదంతో ప్రజలను మోస్తూ మేము చేస్తున్నదంతా మంచేనని చెప్పి వంచన చేస్తున్న వంచన గాళ్ళనుండి... ఛేదించుకుని

కంచెలా తలెత్తుక నిలుస్తాను
మైదానమంత ఊపిరితో...

అంటున్న ఈ కవి స్వేచ్ఛకు కోరుకుంటున్నాడు. అది సంపూర్ణ స్వేచ్ఛగా ఉండాలన్నదే వీరి తపన.

* * *

ఎస్ రవీందర్
రూమ్ నెం. 40
న్యూ రీసెర్చ్ స్కాలర్ హాస్టల్
ఉస్మానియా కాంప్లెక్స్
హైదరాబాద్-7.

(***)

కొందరైన వానికి కారణము పేర్కొన లేదు. పోతన మూలమును గ్రహించుచునే ప్రహ్లాదుని చేష్టలకు కారణమును కూడ చెప్పెను. మూలభాగవతమునందలి పై గ్రంథములు పోతనచేతిలో –

"వైకుంఠ చింతావివర్జితచేష్టుడై యొక్కడు
నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుడింతియ గాని వేఱొండు లేదని
యుత్తలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను విధానము గంటి నేనని
యుబ్బి గంతులువైచు నొక్కచోట
బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుఁడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు"
(7 స్కం-ప 124)

అని రూపమునందినవి. పోతన రచనలో భక్తియొక్క అంతరావస్థనుండి ఫలావస్థవరకు వర్ణింపబడినవి. మూలమునందు క్రమపద్ధతిలో లేనివానిని, పోతన క్రమబద్ధము కావించి ప్రహ్లాదుని భక్తిని యొక సీసపద్యములో వర్ణించెను.

ప్రహ్లాదుని శీలమును వర్ణించు సందర్భమున సంస్కృత భాగవతమున –

'బ్రహ్మణ్యః శీలసంపన్నః సత్యసంధో
జితేన్ద్రియః।
ఆత్మవత్సర్వభూతానామేకప్రియ
సుహృత్తమః॥
దాసవత్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః
భ్రాతృవత్సదృశే స్నిగ్ధో గురుష్వీశ్వర
భావనః
విద్యార్థరూపజన్మాఢ్యో మానస్తమ్భ
వివర్జితః' (7 స్క-4అ-31,3 శ్లో)

అని చెప్పబడినది. దీనిని పోతన –

తనయందు నఖిల భూతములయందు
నొక భంగి
సమహితత్వంబున జరుగువాడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ చేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృభావము చేసి మరలువాఁడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు
సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు
దైవతము లంచు గురువులఁ దలఁచువాఁడు
లీల లందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁడధిప.'
(7స్క, ప 115)

అని అనువదించెను. ఆత్మవత్సర్వభూతానాం అనునది 'తనయందు నఖిల ...' అని. దాసవత్సన్నతార్యాంఘ్రి అనునది 'పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడి' అని, అనువదింపఁబడినది. ఇట్లు పోతన మూలశ్లోకములకు మెరుగుపెట్టి ఆంధ్రీకరించెను.

చండామార్కుల దగ్గర విద్యాభ్యాసము పూర్తిచేసికొని వచ్చిన కుమారుని విద్యానైపుణ్యమును పరీక్షింపగోరిన హిరణ్యకశిపుడు 'భవదీయోత్కర్షంజాపవే'? యని ప్రశ్నించెను. దానికి ప్రహ్లాదుడు చెప్పిన సమాధానము మూలమునందు –

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం
పాదసేవనమ్।
అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మ
నివేదనమ్॥
ఇతిపుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవ
లక్షణా।
క్రియేత భగవత్యద్ధా తన్మన్యే
ఽధీతముత్తమమ్'
(7స్కం-5అ-శ్లో 23,24)

అని చెప్పబడిన భావములే ఎట్టిమార్పులు లేకుండగ పోతనచేతిలో ఒకే ఒక పద్యమైనది.[12]

ప్రహ్లాదుడు సహాధ్యాయులగు రాక్షసబాలకులకు ఆధ్యాత్మిక విషయములను బోధించుచు విద్వాంసుడు కూడ కామ దోష దూషితుడగునని చెప్పిన సందర్భమున మూలములో –

'యతో న కశ్చిత్ క్వచ కుత్రచిద్వా
దీనః స్వమాత్మానమలం సమర్థః।
విమోచితుం కామదృశాం విహార
క్రీడామృగో యన్నిగడో విసర్గః'
(7స్క-6అ శ్లో 17 అని చెప్ప

బడెను. ఈ భావమును పోతన –

'హాలాపాన విజృంభమాణ మదగర్వా
రూఢ దేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయ
సంబద్ధాత్ముఁడై లేకమున్
వేలానిస్సరణంబుగానక మహావిద్వాంసు
డున్ గామినీ
హేలాకృష్టకురంగ శాబకమగున్
హీనస్థితిన్ వింటిరే' (7స్కం-ప215)

అని చెప్పెను.

మూలమున

'న్యస్తక్రీడనకో బాలో జడవత్తన్మయతయా
కృష్ణగ్రహగృహీతాత్మా న వేద
జగదీదృశమ్. (7స్కం అ4-శ్లో37)

అని చెప్పబడిన భావమును పోతన ప్రహ్లాదుని భక్తి తన్మయత్వమునకనువుగ విస్తరించి ఒక సీసపద్యమును వ్రాసెను.[13]

హిరణ్యకశిపుడు తనకుమారుడగు ప్రహ్లాదుని చండామర్కులయొద్దకు విద్యాసముపార్జనకు పంపెను. చండామర్కులు మిగిలిన రాక్షసబాలకులతో కలిపి ప్రహ్లాదుని చదివించినట్లు మూలమున కలదు. ఈవిషయము మూలమున –

---

12. శ్రీమహాభాగవతము – 7 స్కంధము – పద్యము 167

13. ,, ,, – పద్య 122

'పౌరోహిత్యాయ భగవాన్ వృతః
కావ్యః కిలాసురైః
షణ్డామర్కౌ సుతౌ తస్య దైత్య
రాజగృహాన్తికే)
తౌ రాజ్ఞా ప్రాపితం బాలం ప్రహ్లాదం
నయకోవిదమ్
పాఠయామాసతుః పాఠ్యానన్యాం
సురబాలకాన్' స్కం7-శ్లో 65-1.2)

అని చెప్పబడెను. ప్రహ్లాదుని పురోహితు లగు చండామార్కులయొద్దకు ఏలపంప వలసివచ్చెనను సందేహముకలుగు నేమో యని తలచిన పోతన సమాధానము కూడ చేర్చి మూలమును అనువదించెను.[14] మూలమిట్లు పోతన లేఖినియందు మిక్కిలిగ విస్తరింపబడినది. ప్రహ్లాదుడు గురువుల దగ్గర విద్యను అభ్యసించసాగెను. కొందికాలము జరిగిన పిమ్మట హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పిలిపించి-

'ఏకదాసురరాట్ పుత్రమం
కమారోప్య పాండవ!
ప్రపచ్ఛ కథ్యంతాం వత్సమనుతే
సాధుయద్భవాన్॥' స్కం7 65శ్లో4)

అని ప్రశ్నించెనట్లు మూలమున కలదు. తెలుగున పోతన దానిని మిక్కిలి పెంచి వ్రాసెను. మూలమున లేకపోయినను సంతానముయొక్క మాటలు తల్లిదండ్రులకు కలిగించు ఆనందమును గూర్చి పోతన వివరముగా వర్ణించెను.[15]

ప్రహ్లాదుడు తండ్రికి సమాధానముగా-
'తత్సాధుమన్యేఽసురవర్య దేహినాం
సదాసముద్విగ్నధియామసద్గ్రహాత్॥
హిత్వాత్మపాతం గృహమంధకూపం
వనంగతో యద్ధరి మాశ్రయేత్॥
(7 స్కం-శ్లో5 అ-5శ్లో)

అని చెప్పినటు మూలమునకలదు. దీనిని పోతన -

'ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి
నూతిలోపలం
ద్రెళ్ళక వీరు నేమను మతిభ్రమణంబున
ఖిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని లీలగ గా
మయమంచు విష్ణునం
దుల్లము చేర్చి కారడవి నుండుట మేలు
నిశాచరాగ్రణీ!' (స్కం7-ప142)

అని ఆంధ్రీకరించెను ఒక తత్త్వవిషయము సులభగ్రాహ్యము కావలయు ననుటయే దీనికి కారణము.

ప్రహ్లాదుడిచ్చిన సమాధానముహిరణ్యకశిపునకు రుచింపలేదు. సేవకులకు దైత్యులను పిలిచి గురుగృహమునకు తీసికొని వెళ్ళవలసినదిగా చెప్పెను. ఛద్మవేష ధారులగు వైష్ణవులు వీనిని ఆలోచన పాడు చేయకుండునట్లుగా జాగ్రత్తపడవలసిన దని గురువులకు చెప్పవలసినదిగా హెచ్చరించెనని మూలమున చెప్పబడెను.[16] ఏరాక్షసకుమారునకు కలుగని విధముగా ప్రహ్లాదునకు శత్రువు పరిస్థితముగు విష్ణుభక్తి ఎట్లుకలిగెనో తెలిసికొనతలంచి హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ఆ విషయమును గూర్చి ప్రశ్నించినట్లు ఆంధ్రీకరణమున తెలుపబడినది. పోతన ఆంధ్రీకరణమున-

'ఎట్టాడిన నట్టాడుచు రిట్టడి
పలుక నెఱుగరితుల శిశువున్
బట్టించి యెవ్వరేనియుఁ బట్టించిరొ?
బాలకునకుఁ బరపక్షంబుల్
సాకం జాడగఁ జోద్యమయ్యెడుఁగదా!
నాతండ్రి యీబుద్ధిదా
నీకున్ లోపల-దోఁచెనో? పరులు
దుర్నీతుల్ పఠింపించిరో?
యేకాంతంబున భార్గవుల్ పలికిరో?
యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృపాపరాధుఁ
డతనిన్ వర్ణింపనీ కేటికిన్'
(7 స్కం-ప 144, 145)

అని కలదు. హిరణ్య కశిపుడు చండామార్కులు చెప్పిరాయని అడుగుట మూలమున లేదు. 'జనోసబుద్ధిర్బ లాశాంభి ద్యతే పరబుద్ధిభిః' అని మాత్రమే కలదు. ఈవిస్తరణమును పోతన లోకనీతి కనుగుణముగా కావించినదే.

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని విద్యాభ్యాసంగమును పరిశీలించుటకు మరియొకపర్యాయము కుమారుని పిలిపించెను. ఈ సందర్భమున చెప్పఁబడిన -

1. 'అడుగడ్డునకు మాధవాను చింతన సుధామాధుర్యమున మేను మఱచువాని' (స్కం 7-ప160)

2. 'చోద్యంబయ్యెడు నింతకాలమరిగన్ శోధించి యేమేమిసం' (స్కం 7-ప 163)

3. "నిన్నున్ మెచ్చరు నీతి పాఠమహిమన్నీ తోడి దైత్యార్భకుల్." (స్కం 7-ప 164) పద్యములన్నియు అమూలకములే. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు సమాధానము చెప్పిన సందర్భములో పోతన వ్రాసిన పద్యములు-

1. "చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబుల్ నే" (7 స్కం-ప 166)

2. ''అంభోధిందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూకప''(7 స్కం-ప 168)

3. ''కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ'' (7 స్కం-ప 169)

14 ,, ,, పద్యములు 129,130,131

15. శ్రీమహాభాగవతము- 7 స్కం - పద్యములు 136, 137, 138, 139, 140, 141

16. శ్రీమద్భాగవతము (సంస్కృతము) స్కం-7 స్కం-అ 5-శ్లో 6-8,

4. "కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? పవనగుంభిత చర్మభస్త్రి గాక" (7 స్కం-ప 170)

5. "సంసార జీమూత సంఘంబు విచ్చునే? చక్రిదాస్య ప్రభంజనము లేక" 7 స్కం-ప 171)

అనునవన్నియు అమూలకములే. కావున ఈ భావములన్నియు పోతనామాత్యుని వనుటయే సమంజసము.

మూలభాగవతమున శ్రీ నృసింహస్వామి అవతరణ సన్నివేశము ఇరువది రెండు శ్లోకములలో వర్ణింపబడినవి [17] శ్రీ నృసింహుని అవతారమూర్తి 'నాయం మృగో నాపి నరో విచిత్రమహో కిమేతన్నృమృగేన్ద్రరూపమ్' (7 స్కం-అ 8 శ్లో 18) అని చెప్పబడినది. పోతన ఆంధ్రీకరణమున-

"నరమూర్తి గాదు కేవల
హరిమూర్తియుఁ గాదు మానవా
కారముఁ గే
సరియాకారము నున్నది
హరి మాయారచితమగు యథార్థము
చూడన్." (7 స్కం-ప 286)

అని అతిలోకమూర్తిని ఆవిష్కరించినాడు.

శత్రుపక్షపాతమును కలిగిన ప్రహ్లాదుని శిక్షించుటయే యుక్తమని భావించిన హిరణ్యకశిపుడు

"పరోఽప్యపత్యం హితకృద్యథౌషధం
స్వదేహజోఽప్యామయవత్ సుతోఽహితః
ఛిన్ద్యాం తదఙ్గం యదుతాత్మనోఽహితం
శేషం సుఖం జీవతి యద్వివర్జనాత్"
(7 స్కం-5 అ-శ్లో 87)

అని తలచినట్లు మూలమున కలదు. దీనిని పోతన

"అంగవ్రాతములోఁ జికిత్సకుడు దుష్టాం
గంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయు క్రియనీ యజ్ఞాం
గుళద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధమం
జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదఁ గులము
నిర్దోషంబు గావించెదన్"
(7 స్కం-ప 188)

అని ఆంధ్రీకరించెను

మూలభాగవతమును అనువదించు సందర్భములో పోతన శ్రీధరయతీంద్రుని వ్యాఖ్యానమును కూడ చూచినాడు. వ్యాఖ్యానగత విషయము గ్రహించుటలో పోతన మిక్కిలి ప్రతిభను కనుపర్చెను. శ్రీధరీయ వ్యాఖ్యానము ననుసరించి పోతన వివరించిన అంశములను 1. కథాపరామర్శలు 2. గూఢార్థపద భావవివరణము 3. పదప్రయోగ స్వారస్యవివరణము 4. శబ్దార్థాలు అను నాలుగు విధములుగా వర్గీకరింపవచ్చునని డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు అభిప్రాయపడినారు.[18]

పోతన ప్రతి పద్యమును మూలశ్లోకమునకు సన్నిహితముగా నుండునట్లు అనువదించుటయందును, ప్రతి పద్యశిల్ప సమీక్షయందును, సౌందర్య పరిస్ఫురణమునందును జాగరూకతను వహించుచు రసోదయమునకు ప్రాధాన్యము నిచ్చెను. కావుననే ఆయన అనువాదము హృదయానువాద మయ్యెను.

---

17. శ్రీమద్భాగవతము - 7 స్కం-8 అ-శ్లో 11-30.

18. శ్రీమదాంధ్రభాగవతానుశీలనము డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి-పుట 101.

* * *

డా॥ నందూరి వేంకటసత్యరామారావు
48-18-23, గాంధీపురం-I
రాజమండ్రి.

......



Editor, Printer and Publisher B. Ravikanth at B. V. & Co. Press,
Tyagaraja Nagar, Rajahmundry-533 101.